# గిరికపెండ్లి

(వసుచరిత్ర వచనము)



విభాగము ..............................

విభాగ సంఖ్య ..............................

పాటిబండ మాధవశర్మ, ఎం. ఏ. (ఆనర్సు)

ఆంధ్రోపన్యాసకులు

యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాల, విజయవాడ.

# గిరికపెండ్లి

వసుచరిత్ర వచనము



పాటిబండ మాధవశర్మ, యం. ఏ. (ఆనర్సు)
ఆంధ్రోపన్యాసకులు
యస్. ఆర్. ఆర్. అండ్. సి. వి. ఆర్. కళాశాల, విజయవాడ.

ప్రకాశకులు:
యం. యస్. ఆర్. మూర్తి అండ్ కో.,
విశాఖపట్టణము



# అంకితము

నా జననీజనకులు

మహాలక్ష్మమ్మ వేంకటరామయామాత్యులకు



తృతీయ ముద్రణము : 2000 ప్రతులు.

జులై 1951.

శ్రీమంతంబగు ప్రతిష్ఠానపురంబు రాజధానిగాఁ జేది
సామ్రాజ్యము నేలిన చక్రవర్తి వసురాజు. అతఁడు శక్రా
పాదిత్య దివ్య చిహ్నధరుఁడు; చంచద్విమానాధిరాజక్రీడా
పరుఁడు; నమానుష మహాసత్త్వాస్పదుఁడు. అతని రాజ్యమున
క్షితిదేవు లెల్లరుం జతురాస్యులు, పురుషోత్తములు, సర్వజ్ఞ
మూర్తులు; రాజన్యవరు లెల్లరుం బుష్పవద్వంశ్యులగుటఁ గువల
యాధార కమలానుగుణవిహార సారసోపన్యాసరులు; కిరాటు
లెల్లరుం గోటికోటి విలసద్ధ్వజకోటులు; విష్ణుపదజు లెల్లరుం
బలిచూడామణులు.

తన సారసారణులచేఁ గేదార కోదార సస్యములు
ముక్కారుం బండించుచుఁ గాంతకనకాబ్జాలంబరోలంబయగు
శుక్తిమతీ వాహిని యప్పురి నొరసి ప్రవహించు చుండును.
సత్కవి నిషేవితమగు జీవనము, నచ్ఛతా పావనతా గభీరతల
పట్టగు నాశయమును, విశ్వధాత్రీవలయ త్రికాల ఫలదేశికము
లగు ప్రచారములును, ముక్తావళి విభ్రమాస్పదములగు సవ
కంబులునుం గల్గి వెల్గొందు నన్నదీమతల్లి పెంపు నుతింప
శక్యమా? కులమునం బెద్దయు నమూల్య గుణమణి ప్రకాండ
పరిపూర్ణయుం గావున సకల నదులుం గౌరవమునఁ దన్నుఁ
గొలువ ననుదినంబు నన్నది నలువ కొలువున కేగి వచ్చు
చుండును.

అమ్మహానది యాలీల నాళీకజుం గొల్చి యొక్కనాడు ప్రియాలీ కేళీసంభ్రమ వినుత మరాళీ గతులొప్ప మరలివచ్చు చుండ హైమగర్భమందిరమున కరుగువాడు కోలాహలాఖ్యుం డగునొక పర్వతేశ్వరుం డెదురయ్యె. అతడు సుమనోధివాస భాసుర శిఖోన్నతివాడు, ఘనసార తిలక వాసనలవాడు, ఘనసంకు మదసాంద్రగండభాగములవాడు, నవ పద్మరాగదంత ములవాడు, ననర్ఘ్య రత్నావళీ విచిత్రాంబరాభి రామ శృంగారములవాడు. అచలాధిపమౌళికిఁ బుత్రుండును, జగ జ్జనని కనుంగు దమ్ముండును, శంకరునకు ముద్దు మఱందియునై తన భాగధేయ మహిమంబున మిన్నులు ముట్టి నడతెంచు ధన్యుడగు నాతనింగని శుక్తిమతియు నయంబున నమస్కరించి వినయమున నోరయై చనియె. బాలకూర్మవిలాసపదయు, రంభా ప్రతిబింబోరుభవ్యరుచియు, కమల కోమలముఖ కమ నీయయు, నుత్పల మంజులా లోకనవిలసనయు, ఘనఘటానీల వేణియు నగు నత్తరంగిణీరమణి నిత్య నిర్మలాకార కాంతిధార హఠాత్తుగా నెదురై యన్నగేంద్రు గాఢతర ధైర్యము నువ్వె త్తుగా హరించెను. ఆతరణిం దరంగిణి తన ధైర్య సర్వస్వము లోఁగొని చన నన్నగలోకేశ్వరుండును నా చెలువ చెలు వంబు సర్వంబు లోఁగొని యల్లనల్లన ధాత్రీ నికేతనాభి ముఖుండై చనియె.

కాని యాసైకతశ్రోణి యొప్పులు తెప్పరక చూచి చన్న యానాడు మొదలు నగేంద్రతనయుం డుపొంగి పైపై రసంబు జృంభింప, నాశయములు భ్రమింపఁ గూర్మిలుమించ

మనోనిబిడ చింతా తన్మయత్వంబున నుత్కలికా చాపల్యములు దీపింపసాగెను. శైలకులేంద్రుండిట్లు మదశాలి శుకాలి పికాలి శారికా జాలక నీలకంఠరవ సంగతిఁ దాల్మి నిల్పఁజాలక కరాళకంతుశర వేదన దీఱ నదీరసోర్మికలఁ దేలినంగాని మహనీయ సుఖంబు గలుగదని నిశ్చితాత్ముండై యుజ్జ్వల వేష ధారియై యొకనాడు శుక్తిమతిం జేరంజనియె. అన్నదియుఁ దటోద్గతఝరీమిష నెదురేగి యూర్మి హస్తములతో రాజీవ మణిభాజనంబుల రజశ్శ్రీగంధ కింజల్క రేఖా రక్తాక్షతము లర్పించి యాతనిం బూజించి మధురవినయ మంజు వాక్ప్రంజ ముల నిట్లనియె. "నగేంద్ర! శైవలినీశతము లిలెను మీకు నాయిచ్చు నీయర్ఘ్యతోయ మెంతటిది? ప్రాలేయనిలయ సంభ్రమముగాంచిన మీకు నా యొసంగు నీ పస్నీటిపాద్య మేపాటిది? మందార మంజరుల రంజిల్లు మీకు నా యొసంగు నీ పూదండ యేమిగొప్ప? గోరత్న దోహన గురులక్ష్మి గల మీకు నా యొసంగు నీమణిమాల యేమూల? అనఘ! కొండంతవారికిఁ గొండంత పూజ సేయ నెవ్వారికగు? గోత్రతిలకుడవగు నీవు శక్తిమై నాయొసంగు పుష్ప పత్ర తోయమాత్రమునం బ్రసన్నుండవగుదుగాక. గుణగరిమ సమేతాత్ములగు మీరిచటికే తెంచుట మదుపరిజాతాభి నవానురాగ సంపత్తిచేతనేకదా!"

నావిని యావలిగట్టు రాపట్టి యానన గహ్వర రోచమాన నూతనదంతహీరుచి ధారలు వెల్వడ నొక్కలేత నవ్వునగి "అగునగు నిజంబ పల్కితివి. భువనాశయ సన్నివేశ వేదినివి నీవు సరసాగ్రగణ్యవుగదా" అని వెండియు నిట్లనియె,

"అశేష తటినీ పద్మాస్యలం గూడి నీ వరవిందోద్భవు మందిరమునుండి వచ్చుతఱి నాఁడు నీ యచ్ఛాచ్ఛభావము, నీ సరసత్వము, నీ గభీరత, నీ సర్వంకషప్రౌఢి, నీ పరిపూర్ణత్వము గన్నారఁగాంచి మెచ్చి సదా నిన్నే నెమ్మనమున సంభావించుచుండు. దివ్యద్వీపిను లెందరో పద్మోద్భవు నోలగంబునకు రాకపోకలు సేయుటయు, వారును మేమును ననుసంధించుటయుఁ దరచు సంభవించుచునే యుండును. కాని చెలీ! ఏ పద్మాసనం జూచినను నిన్నుఁజూచి నట్లుండెదుసుమా! పలుమాటలేల? ఈ మన నెయ్యములు పూర్వజన్మ కృతములా యనిపించుచున్నవి. విమలమధురమనోహరవృత్తి నెలయువారిం గాని యాడ బుధులెంత దవ్వేని నరుగుదురుగదా. కావున నోతాపశమని! నేనును నీపొందుఁగోరి వచ్చితిని. ఇంకఁజెప్పెడిదేమి? నాకుంగల జీవనమంతయు నీ కర్పించి యెల్లప్పుడు నిన్నుం బాయక నీకుఁబ్రియాచరణంబు గావింతును. నీవిఁచోప్పనకొప్పుకొని నీయంతరంగమునకుందార్చి నన్ను నదీనుఁజేయుము."

ఘనధ్వని గంభీరములగు నగరాజు పలుకులకుఁ జికి ముకుళిత కరాంబుజయై నయవినయ భయంబులు బెనంగొన శుక్తిమతి యిట్లనియె. "పంకావిలంబగు నంతరంగంబును, బుద్బుదప్రాయంబగు జీవనంబును, కుటిలప్రకార కారణంబులగు సంచారంబులును, భంగాకులంబులగు నుత్సేకంబులునుం గలిగి నిలుకడ హులికిరియగు నేనేఁ? అచలితోత్తుంగ స్థైర్యుండవు, ననఘగతివి, యభంగ శీలుండవు, నలఘుమతివి నీవేడ? ఇట్లు విభిన్న శీలులమగు మనకుంబొందెట్లు కలుగును?

నావిని యావలిగట్టుపట్టి వదనమున నించుకవిన్నఁదనము దోఁపనిట్లనియె. "ఓ శైవలినీ శిఖామణీ! నిజముగా నీకమనీయ కాంతిధారావళిలో మునింగితిని. దయామతిం బ్రోవక సుళ్ళు వెట్టెదవో, గ్రుచ్చియెత్తి ఘననిర్వృతిం దెప్పలఁదేల్చెదవో" అనుటయు వెలవెలంబారి వెండియుం గొండలఱేని కన్యేటిట్లనియె. "అగ్గలంబగు పంచసాయక వికారమున నిజగౌరవోన్నతులు దలంపక పల్కెదవుగాక. మాదృశ జడాత్మల సంగతిం దెప్పలఁ దేలుచుండిన మీ కులగిరికోటిలో నీకు లఘుత్వము గాదా? క్రీడారతి నీమతిం గల్గెనేనియు సకల పుణ్య దేశాళిం ద్రిమ్మరుచు దపఃస్ఫూర్తిమై గృశించుచు వనరాసులం జెందం జూచు నావంటివారిం గ్రమ్మనేల? తారుణ్య లావణ్య జృంభితలగు రంభాది నిలింప భామలు నీకుం గొఱయగుదురా?" నావుడు శైలేంద్రుడు రాగాంధుడై "వెట్టిదాన? చదలేఱు సిగఁదాల్చి నింధాన చిత్రకున కతనుభూతఘటింపదయ్యెనా? రవిసుతా పతియైన దైతేయ భంజనునకు నరవంశవైఖరి పదలెనా? జాహ్నవిం జేకొన్న శంతనునృపమణికి వసులాభ సంపత్తి మసలెనా? నానానదీకాంతుడైన రత్నాకరునకుఁ గమలోదయఖ్యాతి దెమలెనా? వారికే లాఘవమువచ్చెను? ఈ కల్లిబొల్లి నేమములు చాలించి సన్నేలుము." అని యామె కోమలకరకమలము దన ప్రబలభుజశాఖల నొడిసి పట్టెను. ఆ సైకత శ్రోణియు విచలిత వేణియు, వికంపిత మృణాళభుజయు, విలోల శఫరీకటాక్షయు, విజృంభితహంసక క్వణయు, వివర్తితాబ్జముఖియునై బిట్టు సంభ్రమించిపోయెను.

అంత నాగట్టుదొరపట్టి యెట్టకేలకుం బట్టరాని తమకంబున మాటిమాటికిఁ గూటములం బాటింపుమని యయ్యేటి నడ్డగించుచు నలముకొని చెంగలువతావులు సెదర వేణిఁదెమల్చుచు, మకరికలు నులియ గండపాళి నొక్కుచు, మధురామృతంబులు వడయం బలుతెర సొబగు లానుచుం దనివిసనక తద్దయు నా గద్దఱి యమ్ముద్దరాలిం బెద్దయుం బ్రొద్దు నిరోధించెను!

ఇట్లు శైలోపరుద్ధయగు నా శైవలిని యెలుంగెత్తి " వసుధామహేంద్ర! ఓ వసుభూప! ప్రోవరావే!" యని మొఱవెట్టుచున్నదో యన భూరివారివిహాగారవం బెసగె. అవ్వరటాకారండవాది ద్విజారవముకన్న మున్న గిరివ్యావిద్ధ కల్లోలినీ సలిలోపప్లుతిభాజను లగు భూజనులు నిజనివాస స్థేమ శూన్యులై ఘూర్ణిల్లు ఘోష దిక్చక్రము నిండఁ బాఱెను. ఆ ఘోష విని "యిది దురంతశైలమథనావిర్భూత సింధు ధ్వనియా, కాక మహోదకప్రళయ సంత్రాసము లోకాళిం బైకొని కారించెనా? ఈ దుస్సహ మహాకోలాహలోద్వృత్తి కేమి నిమిత్తంబో" యని యవ్వసురాజోత్తముఁడు లోకభరణాయత్తుండయ్యెను. అయ్యెడ నానా జనపదకటక స్థానాశ్రయులగు జనులెల్లరు నడెంచి క్ష్మానాథు ప్రోల నీలీల దీనాలాపంబులు గావించిరి. "దేవా! రక్షింపు రక్షింపు. మిక్కుటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహములు పిక్కటిల్ల బెల్లున గుభిల్లున శుక్తిమతీస్రవంతి పేరక్కున బ్రాలి

జిక్కులువడ్డ లతాద్రుమమాళికతో, ముక్కలయిన యుపల శ్రేణితో నక్కొలాహలుండు మూర్ఛాలసుండై యేటిపై మోహంబునను సమ్మోటివలనిభయంబునను గుక్కిళ్ళు మ్రింగుచుండెను. అంతలోన వసురాడ్విజయనందిత శక్రోపసర్పణంబు సూచించుచు మందార వర్షవర్ధన బృందారక బృంద దుందుభి ధ్వని గర్జాసందోహము సందడించెను.

గోత్రవర్గముఁ బాదుకొల్పిన వసుశాలియుఁ, గరమున శతకోటి గల్గునేటియు, నహిత బలచ్ఛేదియుఁ, దలపుప్పవాడని భోగియునగు వేయికనులవేలుపు భూవిభుని మెచ్చి యుచితమగు పారితోషికంబొసఁగ వచ్చెను. వచ్చి తన కభివాదమొనరించు వసున్నృపాలు గరములాలించి, కన్నులఁ గప్పుకొని పురందరుం డమంద మందార మకరంద మధురవచన సంభాషలింపొంద నిట్లు పలికెను. "ఓ వసుక్ష్మామండలాఖండలా! జగన్నుతులగు వివిధోర్వీపతుల మున్ను వీక్షించితిమా! వారి పెంపు పరీక్షింపమా! చెలిమి నింపమా! కాని యీ భువనత్రాణ పరాయణోద్భట భుజాభూరిప్రభావంబు, నీ జనానురాగ బలంబు నెందైనఁ గంటిమా? ఈ ధరణీంద్రకోటులలోఁ బ్రతిసి నరాధిపుఁ గొంత పెద్దగా నరయుదుగాని తదీయ [illegible] నీపాద నఖాంచలంబునకును సాటియగునా! వేయేల! మహిష్ఠాంతర పవిరేఖ శుభ లక్షణాకృతిని నీయడుగుసంబంధమేనా? ప్రబల ఖల గోత్రహృతి కింక మాకు నీపదనఖంబే చాలును. శతకోటి సాధనంబేల? నీయంత మహితుఁడగు పతిలేఁడు గట్టిగాం జేసి యీ నాడుఁగదా! సురలకెల్ల సౌమనస్యము నివ్వటిల్లె. హితసుమనో మనోరథములెల్ల ఘటింపఁజాలు నీకు

సుమనోరథం బొక్కటి యీవలతు" నని యవార్యమహార్యమ
హార్యభీశు సంయుతంబగు నొక్క దివ్యవిమానముఁ జూపి
వెండియు నిట్లనియె. "జలనిధి స్వారభౌమ తనుజా దనుజాలరుల
పెండ్లి యారేగింపునాడు విశ్వకర్మ యభవాబ్జభవాదులు
మెచ్చ నేర్పుననిద్దాని నిర్మించెను. అహస్కరుపై నౌరపైస
కై వడిం దీనిపైఁ జారురమా పరమానుమంగుడై గదాధరుం
డలరెఁగదా. రవికోటిబింబ సంభావితమగు నీ శుభవిమానముఁ
దప్పక చూచు నా పేరాస యెఱింగి విరించిగురుండు ప్రియంబున
నిద్దాని నాకొసంగె. భూనాయక! అసమాన దివ్యమణిశకల
శలా కానీక నిర్మితంబగు నీ దివ్యవిమానము నాఁనాటికి నసంత
కాంచనములు గురియును.

చిత్రభానూజ్జ్వలంబగు నియ్యది సర్వలోకాలోక సౌఖ్య
మొసఁగును. దివ్యధామోన్నతంబగు నియ్యది యనంత
వాహినీ విభవము సలుఁజేయును. ఘన ప్రకాశంబగు నియ్యది
యభంగ మణిచాప శర పరంపరలు గురియును. శరజ్జ్యోతి
ర్వారాకృతి యగు నియ్యది శార్వర గర్వభంజన మొనర్చును.
అశేషదోషాంతకమును, నితాంతకాంతకళ్యాణనిధియుఁ, గాను
రూప రమ్యమును, నమృతాన్న సారప్రదమును నగు దీనిం
గొనియాడ వాగ్జానికేనిం దరముగాదు. అనంతమణి కాంత
ధామమై యియ్యది హిమానీవేళ సింపునింపును. వసంతాగమ
మునం దియ్యది శోణ ప్రవాళమంజులతా నిశాంతమై
యలరించును. తరళముక్తాదీప్తి ధారాధివాసమై యియ్యది
వేసవిని మహోల్లాస మొసంగును. [illegible] నియ్యది ప్రబ

వజ్రోపలప్రాసాదభాసమై కుతూహలము నిలుపును. ఇట్టియ్యది సర్వసమయ సౌఖ్యజనకము సుమా. సర్వసద్గుణ గణంబుల ప్రోవని యిద్దాని నీకొసంగితిని. దీని నెక్కి నిర్మల సన్మార్గ విహారశాలివై వేడ్కమై నిచ్చలు మా వీటికి రాకపోకలు గావింపుము." అని యొసంగుటయు వసుంధరా రమణుండు భువనానందంబు సంధిల్ల నావ్యోమయాన లలామంబుఁ బరిగ్రహించెను.

ఇట్లు జంభారి కుంభినీపతి కప్రతిమాన విమానంబు సమర్పించి సుఖంబుండు మని చనుటయు నపరిమిత కుతూహలంబున నచటి తాపసులా నృపతి కపు మపరిచరవసు నామధేయం బంకించి సంకీర్తనంబు గావించిరి. అనంతరం బనంత విజయ కీర్తి లాభసౌభాగ్యధన్యుండగు నారాజన్యుం డనన్యాస్పృశ ప్రమోదభరంబునఁ బురంబునకు మరలివచ్చి జగజ్జేగీయమాన విమాన మహిమంబునం బ్రతిదివస జాయమానంబులగు జాతరూపమణికలాపంబుల భూదేవతావర్యులకు సపర్యలు గావించుచు నిష్టాపూర్తంబులు నిర్వర్తించుచు నొక్కొక్క యెడ నవ్విమానంబు నెక్కి నాకలోకాదిలోకంబులు, నానానగ వనానీకంబులు, నవద్వయద్వీప సాగరంబులు, నదనదీప్రచారంబులు నీక్షించుచు శుక్తిమతీ మహానది విహార దీర్ఘికయుఁ, గోలాహలంబు లీలాచలంబునుంగా మెలంగుచుండెను.

౨

అఖిల భువన నిరోధ కాహార్యరాజ గంధ నిర్గంధనుని రాక కలిమిచే నలముకొన్న యలజడి యుడుగఁ బ్రసన్నమైన యేటి కొయ్యనొయ్యన గర్భంబు తేటవడెను. అన్నాళీక ముఖికి నెన్నడుము ప్రస్ఫుటంబై నెత్తములు బిత్తరము దర లెను. ఆశఫరాక్షి కున్నతస్థలు లగమ్యములై నడలు బడిబడిం జడనువడెను. ఆచారువేణికి వింతచవుల నింపులు మీఱి గండ రేఖ విశదమై కనుపట్టెను. అక్కఁబు కంఠికి సాంద్రకంకణ ములు జారి నాదము మాంద్యము వహించెను. ఆపన్నసత్వ యగు నయ్యాపగ యాపగది నీరు మోసి యధిగత సేవా వ్యాపారలగు ద్విజ మహిళలు గాపాడుచుండ నొక్క పుణ్య లగ్నమున హల్లకకరదీపదీధితులు గ్రమ్మునట్టియు, నవార విందమకరంద శైలములు నూలొక్కనునట్టియు, నొక్క గురు తర నవ్యవేతస నికుంజమున నొక్క కుమారుఁ గుమారికం గాంచెను.

అయ్యెడ నెయ్యపుం దొయ్యలియందుఁ గల్గిన తనూ భవ సంపద పేర్మిమై మదన్వయము పావనమయ్యెఁ గృతి నైతినని యాశీత శైల తనయాగ్రణియు వసుక్షితీంద్రుచే బ్రయ్యలువడ్డ నెవ్వగ లనంబును నెమ్మనమునం దలంపకుం డెను. అమితానంద రసద్వీజారనము చెన్నారఁ గుమారో

దయప్రమదారంభ విజృంభమాణయై యప్పద్మాక్షియు శైలా వరోధము వారించి వసుపాదంబు దన్నుం గాచెఁగదాయని యూహించి నెయ్యము దైవాజ్ఞఁ గుమారునకు వసుపదా ఖ్యానము గావించెను. గిరిరాజ కన్యకైవడి నీ సుశీలయు సిరిరాజిల వెలయునని యా గిరికన్య కచ్చటి పౌరులు గిరి కాశుభనామమిడిరి. ఆ నదీనందన జనించిన యనఘ ముహూ ర్తమునం దిందు తారాప్రసాదముల నెన్నందరమా? తారకా భర్త సుముఖత దాల్చెను. తారకలును శుభాంగ్రుల నభగ వైఖరి వహించెను. అన్నదీలలామయు గూమారుం గూమారి కను జలకములార్చి, పాండు జలజచ్ఛద పాళికంగప్పి, తమ్మి సంకులం దెలితేనియలుగ్గులిడి, క్రొందరగలు కదల్చు కల్గ తొట్టియల ఘటించి కోమలి కుముదాగతాళికుల నమంజునసం బునం జోలలు వాడుచుఁ గాపాడుచుండెను.

అంతఁ గ్రమక్రమంబున వర్ధమానవపుగు నన్నదీ నందన కిందిందిరాజీవంబులగు రాజీవంబుల రాజిల్లు మరాళరాజి వసంన యానము నేర్పెను. లలిత నానావాసనావాస కలితాంబువుగు నికటకానన శుకాళి కలికిపలుకుల నలవరించును. కుసుమా రసామోద సామోదంబులగు మానసశుద్ధాంత సమితులు గొనబు పాటలం బాఠములు సెప్పెను. తటగూఢకల్పాగ కల్పాగ చరంబులగు నీలకంఠవితతులు నటనలీలలం దేలించును. అఖిలభాగ్యములుం గలుగున ట్లన్నదీకన్యకు మునిపురంధ్రీ మణులు దీవెనలొసంగుదురు. అనుదినమును సైరంధ్రులై, వయస్యలై విసిన దేవతలు ప్రోతురు.

అయ్యాసగానంగన చెలిమికత్తియలం గూడి గూఢ రత్నసికతాన్వేషము గావించునెడ నిక్కువంపు టెక్కువలం గనంజాల కుండియు నాత్మజననీ పులినోర్వి నెందేనియు మణులంగొనిరాc జెలిమికత్తెలు "భళీ, సిరికలిమింగదా తల్లి నిన్నుం గెలిపించె" నని నగుచుం గ్రీడింతురు. తండ్రియగు కోలాహాలుని పాదభూమియందా గిరిక కల్పక పుష్పధూళిచే బొమ్మరిల్లు నిలిపి తన్మృదు పల్లవ స్వాత్రసంక్తిలోc గేసరములు ఖాద్యములు, మధుసంబుఘృతంబు, ప్రసూన పుంజమోగిరము నని వర్ణింపcగా సఖీతతి కన్నియు నట్టివ యగుచుండును. ఈరీతి నన్నాతి మాతాపితల నడుమ నల్లారుముద్దుగాc బెరుగుచుండెను. శంఖ పరిభావకమగు నప్పంజపాణి కంధర నొక్కొక్కతటిc దల్లి సంకులు గట్టినంగాంచి కులశైల సుతాగ్రణి యద్దానిం బాయcద్రోచి రత్నాకితహారమునుంచుటయు "అయ్యో! బహువానునోయేమో బిడ్డకీ కర్కశాలంకృతులేల" యని యవ్వానిం దొలంచి యన్నదీ లలామ హాల్లకకలాపములుంచును. అనుగుంగ్రీడల నెల్లెకు నిట్టల్లారుముద్దుగాc బెరుగుచున్న కూతున కవ్వాహిని వాణిcదాల్చు సుకవిస్తోమంబు రావించి యూత్మీయ నూతన పద్మోపచయం బెల్లc దత్స్వాస్తంబు గావించి తద్గనవిద్యామహిమంబులెల్లc గరతలామలకంబు గావించెను. ఆనగ శేఖరుండును మహామణికూటములు సమర్పించి కిన్నరకోటులన్నిల్పి కిన్నరమీటను, వీణc బలికింపను, గీతములుc బాడను, ననివారిచాతురి గల్గునట్లు కూతును గేయవిశారదc గావించెను.

అంత గొంత కాలమున కా రాజేంద్రు లాలనంబున నభిమత భోగశ్రీగల భూకాంతకు సైరంధ్రికై వడి నుల్లసిత పత్రలతా సౌగంధ్యమును, నవకళికాసౌగంధ్యము నొసంగుచుఁ జైత్రలక్ష్మి యవతరించెను. సుమనోరాగమున గానసేందిర యశోకపుంగొమ్మపై వసంతముఁ జిలుకరించెను. ఆ కొమ్మ నెయ్యమున నగుచు సరసాళిపైఁ గ్రొన్నన తేనెఁ జల్లెను. సరసాళియు సోఁపుగన్పుం బాటలఁబోయి మాధవి ప్రవాళశాటిం దుడిచికొనియెను. అమ్మాధవియు నక్షీణరాగము మించఁ బలికెంచు కలకంఠిపైఁ బరాగము విదిర్చెను. ఇట్లా సమయమునఁ దీనబోటులు హితకోటులంగూడి మదన దేవోత్సవ క్రీడలం బొదలెను. ఇంక విరుల యోషవుల నఱిలు సిగలంకో వరులును దమణులు నవ్వాల రాచజాతరల మురిసిన తెఱంగులు వేఱ వర్ణింపనేల? నారీజనంబా సమయమున సరి వైఖరిం బంచమము నుజ్జగించి హిందోళంబు భజింపగాఁ బిక జాతంబు స్వీయరవభంగవ్యాకులంబై యన్వసంబునఁ బల్లన వ్రతవిధు లవలంభింప మహాసంపూర్ణ భానోన్నతితో వసంతము సరిగాఁ దదీయ ధ్వనిం దాల్చెను. ఇనకరాఘాతముల కోర్వఁజాలక హిమసంఘాతము శీతక్షమాధర దుర్గంబు నాశ్రయించెను. జగజ్జన కంపప్రదభీకర దోషాయతిశాలియగు నా హిమంబును జుట్టుముట్టి లగ్గలు వట్టి ధట్టింతునని యయ్యరవిందాప్తుడు ప్రబలుండై దాక్షిణ్యముమాని యుదీచికేగెను. తెమ్మెర తేరెక్కి చిగురుఁగైదువు దోర కదలిరాగాఁ బ్రత్యగ్రవృక్షాగ్రహర్మ్య విటంకము లధిరోహించి భావిభావుక ఫలోల్లాసములతో వల్లీ

వనజాస్య లుత్ఫుల్ల పల్లవహస్తములఁ గ్రోవ్విరులు విరజిల్లిరి. మహిళామణుల మంజులభ్రమరకా, మర్దంబును, శ్యామా ముహుర్ముహురున్మీలిత పత్రభేద నిపుణంబును, బద్మినీ కంకణ గ్రహణాపాదియునై సగంధ విటపి ప్రాప్తిమై విజృంభించుచు మధుమత్త గంధవహ మావ్యోళి నవ్యోనాంతంబున విహరింపఁ దొడంగెను. ఆసమీరణ స్వైర విహారమున కోర్వఁ బాలక యుద్యానపాలురు వసురాజేంద్రు మ్రోల నిట్లు విన్నవించు కొనిరి.

"అధిప! ఏపారు పొంపరింట్లఁ దూరి యూపాటలాశోక దీపార్చులఁ గాంచనకలాపంబు హరించెను. నాలావలులం దాటి యేలాలతాబాలల పరాగ పంటంబు లూడ్చెను. నానా మధుప గానంబులు మెచ్చి సూనాసవంబు లెల్లఁ జూఱ లిచ్చెను. ఝంకారహితముగ హుంకరించు శుకభటుల యుహుం కారములచే ఫలాహతి యొనర్చెను. ఈ గంధవహుని ధౌర్త్యము నేమని వర్ణింపగలము?" అని విరిసిన విరులను, రాలిన రజంబును, నొలికిన రసంబును, నురిలిన ఫలంబులును దెచ్చి రాజుమ్రోలనిడి వందియు నిట్లనిరి. "స్వామీ! ఏమని వర్ణింతుము మయ్యారామ రామణీయకము! రంజిల్లు చివురులు, మొలిచిన నసలు, నలరిన విరులు, దలలు సూసిన పూఁపలుఁ, బసిమి నిరవొందు సిందియలు, బలసిన నవశలాటువులు, సాంద్రరుచుల నెసంగు ఫలంబులు గలిగి యామనికి మన నని మనికియై యున్నది. మధుగ్ఘులులచేఁ గాలువలు వఱపి, గసి మలుగ రజంబులు నెఱపి ఉపహారహంబంపిలి సహకారంబులు

నయ్యవసరదంబు వనసీపతి యధిరోహింపఁ గోడుగన నిదెయదనని కళింగ శశాంక ముఖ్యులగు సామంతు లెల్లెడ నెడ యూక క్రందుకొని నెడలిరి. వారి గోడన్రుల గాలిన ముత్యములు సారముతై పురంబు నల్గడలం బ్రసూన కోరక నికాయము నింపిన సొంపునం బరగెను. ఇట్లా రాజపురందరుం డరదంబధిరోహించి సముజ్జ్వలిత హేతిధర విభ్రమంబులు, నుజ్జృంభిత వాహినీశ్వర రసోన్మేషంబులు, నున్నిద్ర పుణ్యజన వాగ్విశేషంబులు, నుద్ధూత కేతనానిల కోలాహలంబులు, నున్నత రాజ రాజభజన కౌతూహలంబులు, నుగ్రసేనా కలకలంబులు నవధరించుచు నా నందనోద్యానంబు సేరం జనియె.

అయ్యవసరంబున నృపసహాళిభవ సువర్ణ పరాగములును సువర్ణపరాగములు నభిన్నత నసిరించెను. కమనీయ తపనీయ కదళికా పవనంబును గదళికా పవనంబును గలసి మెలఁగెను. లలిత మాగధలోక కలకంఠ గానంబునుఁ గలకంఠ గానంబును నలముకొనియెను. వితనాదక సమీరహాత కిన్నరీ సుతులును గిన్నరీసుతులును నేకీభవించెను. ఇట్లు సేనవచ్చిన యయ్యవనిజాని కచటి యువనిజానికను కేళీవన బహిరంగకాక్షీణ మధురసరస్వరీ ప్రతిబింబ సంభావనచే సాష్టాంగమొగగెను. కులపతియునంతఁ దేవుడుగి మహీశులసహిపిబంబు నచటనే నిలిపి నిజహితయుతుడై యుపవనోపకంఠంబున ఘనతర ఫలానతాఖండకదళికలును గీరరాజీకృత సజీవ శోణములును, నలమావి కురుజులును, నభంగ నవ ఫలావళులం గాంచి యానందించెను.

అట్టియెడ చైత్రసత్రశాలికల నిష్టాహారము లారగించి కుతూహలముగాంచు ద్విజావళులు శ్రుతిహితావ్యాజానులాపంబులతో నలఘుశ్రీకర శాఖికాంచల వినిర్యత్కేసరార్ద్రాక్షతలన్నరదేవ రత్నమకుటీ భూషావిశేషముగా రాల్చెను. రామకథాంక శుకోక్తులతోఁ జిగురు జొంపపు గెంపుల పళ్ళెరములం దీపముత్తైమువచాలు గిరిక్రీడవినోదికి శోభనపు టారతు లెత్తెను. ఆ భూకాంతుంజూచు కౌతుహలమునం వ్రతతీ సతీవితతి కలకంఠార్భటుల నొండొరుంబిలుచుచు గాఢచ్ఛదాచ్ఛాదికలు సవరించుకొనుచు నవగంధబంధురరజంబులు చిందుచుండ జాలకంబుల నొంసికొనుచు నికుంజ నిలయంబులతిక్రమించి వాయువేగంబునం దలనూపెను. రసాలవల్లరి చిగురు కెంగేలు సాచెను. తిలకలతిక తేఁటి చూపులం జూచెను. ప్రియాళులత పికగీతిం బాడిచూపెను. కర్ణికారశాఖ కీరభాషం బలికెను. ఇంపుగల సంపంగికొమ్మ ముఖరక్తి నింపెను. లేఁబొన్న తీఁగె వన్నెగా నగియెను. సింధుకవల్లి సురభిశ్వాసంబు నెఱపెను. క్రోవి రెమ్మ తావులు సోఁక గ్రుచ్చెను. ఈ భంగి నంగనా నిత్యకలిత దోహద విశేష సన్నుతాచారముల కనుగుణముగా నయ్యధిపకల్పకమున కాత్మరుచిరోపచారములు తత్తదామోదగరిమఁ జెనుప నుపవనలతికలు స్వాగతోపచారములు నెరపెను.

భూదారుం డిట్లారామవిహారముగావించు నెడ నొక్కెడ "నగియు, బల్కియు, బాడియుఁ, జేయిచ్చియు, గవుగలించియుఁ గొన్ని తనువుల మన్నించిన యంగనలయ్యా మమ్ముందన్నియు

నుమిసియు నెంతచేసిరో చూడు” మని కంకేళియు కేసర మును బూఁదేనెకన్నీటితో భూజానికి విన్నవించుకొనెను. వేఱొక్కయెడ నిబిడవిచలద్దళను పత్రాళిఫలసాంద్రమగు నొక్కనగము తేనె వాఁకలో నొరగఁబడి యేటిలో నాటిన నాఁటి నగరాజు నలువు నారాజు తలంపునకు వెచ్చెను. ఆ క్షణంబున నన్నగాగ్రమున నున్న యొక కిన్నెరద్వయ మన్నిఖిలోక్తివేదికపు డన్యదురాసదమైన యొక యాసన్న శుభముం బ్రసన్నోక్తిం దెలిపి యన్నరదేవ పాదపవిఖిన్న మహానగకూట వాటికై యెగిరిపోయెను. అయ్యద్భుతవిహగయుగాలోకనప్రీతివలన నతిలోకవయఃకోలాహలంబగు కోలాహలంబున లీలా విహారంబు సలుప భూపతి కుత్సాహము చెంగలించెను.



# 3

ఇట్లు కోలాహల లీలాచలాభిముఖుండైన పతింగాంచి నర్మసఖుండిట్లనియె "ఓహో నేనొక్క యద్భుతంబు గంటి నీకునుంజూపెద. అదె నా చేచాయం జూడుము. అగ్రమున నల్లదే నల్లమబ్బులోనాగనుపట్టెడిసి. కంటివే ?" నావిని సూక్ష్మగతి నారసి యారసికావతంసు డల్లన నవ్వి యిట్లనియె. "అది మన కేళిశైలము. అల్లదే తన్మఘవాశ్మ కూటము. అమ్మహీజములు చదలు. భ్రమాకులని భ్రమించి పల్కితివి. అయినను నీపలుకు కేవల మృషగాదు. ఈ నగద్రుమంబులెల్ల నాకద్రుమంబులే యగుంజుమా. వంశములెల్ల మణిలీనుచుండ నచటి సానువులెల్ల రత్నరుచిరంబులని వేఱ చెప్పనేల? నిత్యానురాగములగు నంకురములు గల యచ్చటి ద్రుమములెల్ల సురాగములగు టరుదా ? అతను సంజీవను లగు తావులుగల యచటి లతలెల్ల సంజీవనులేకదా ? సిద్ధ రసంబులగు ప్రసవంబులచే నచటి రసములెల్ల సిద్ధరసములగుట

కేమిగోదువ! ఇందలి మణిచిత్రభూములు, నమరతరువుల గుములులు, దీవల ప్రోవులు, బొందమ్మి కొలకులు నభవుని యింటఁగాని వింటగాని కాననగునా? కాదందువే నదియేమి దప్పుగాదుగదా. పోదము రమ్మా. ఆయద్రిశోభలం దిలకింతము." అనుచు నమ్మహీపాలుండు వేడుక చెలికాని కైదండ బూని లీలాగిరిం గదియరా నందలి వైమానికమానినీ మధుర గాన స్వానానందుండై నర్మసఖుం డిట్లనియె.

"అనపాయపిక గేయసముదాయ మొకచాయను, నానామయూరనినద మొకసీమను, నకలంకమకరాంకహాయ హేష లోకవంకను, వనదేవయువతిగీతము లొకక్రేవను, సురకాంతల కరాంత తతనాద మొకచెంతను, నవశారికోదితము లొకదారిని, పటుచారణకుమారభణితంబు లొకయోరను, నలిమండలి కలగాన మొకదండను నొక్కుమ్మడి మ్రోయఁగాఁ గదలీగృహోపపన్న కిన్నరీబృంద సంగీతగీతరీతి నతివేల కోలాహలముల కలిమి నమరు నీయద్రి కోలాహలమా యేమి? ఘన జాంబూనద రౌప్యరత్న రుచులతో నిగ్గులుంబుట్టిన గండోపలములందలి యుష్మచ్చరణావధూతమగు నీ శైలము నోదార్ప వచ్చిన మేర్వాదిగోత్రాధీశుల బోలియున్నవి కంటివా? అయ్యో! పాపము. నీయుదగ్ర చరణాహతి కోర్వలేక యీ గట్టురాయుని కూలమున నీగతి స్రుక్కెనో గదా! కపోతపంక్తుల మూర్ఛవము నేటికిని బిలముఖంబుల నరుణాంబురఝరీ కుసుమంబులను నెత్తురులు గ్రక్కుచున్నడు చూడుము."

నర్మసచివు నుడువు లాలించుచు నాసింహాసంహాననుండు నిజలీలాహర్మ్యం బారోహించి తదీయనిర్ఝర సమీరాందోళి తైలాసుగంధి నికుంజాంత నవేందుకాంతమణివేదిపై సుఖాసీనుం డయ్యెను. అంతలో మాధురీధుర్యమై యొక్క కలస్వనము శ్రవణపథముసం బడియెను. వీనులకు విందై యమృతప్రసాన లకుం బొందై యాస్వనము బ్రహ్మానందము ననుసంధింప నవ్వ సుంధరాపతి యిట్లనియె "వయస్యా! వింటివా? నవ్యామృతా వ్యాహతాస్వాదంబై, పరమానందానుసంధానంబై షట్పదీ నాదమో, కలకంఠీనాదమో, మరున్నారీమణీ వల్లకీనాదమో వివరింపరాని యొకనాదము విననయ్యెడిని. ఉర్విపై నానాగాయన గాయనీమణుల గానంబు లాలింపమా! అందుగానిందుగాని యేనాంపజేని డెందమున కిట్టివిందై యానందసంగోహాముం గూర్చెనా"? నావిని యానయస్యు డాస్వానమాలించి యిట్ల నియె. "జనవర! వల్లకీరమునంగతి నెవ్వరో యిమ్మహాద్రిపై వినూతన గతిం బాడుచున్నారు. ప్రమదాకులకోకిల కేకిలోక ములు తన్మృదు పంచమషడ్జశయ్య కొయ్యన నెలుగిచ్చు చున్నవి. వింటివా?"

శిశికాంతదరీ జనితప్రతినాదమైన యా సంగీతకలస్వనము దన మనమున నొకానొక యనురాగభరము వెనుప నవనిపు డిట్లనియె. "ఏ రెచ్చటివారో! ఈదరులలో, నీబలుకానలో, నీనగాలిలో నెచ్చట నున్నవారో! మది కింపునింపు కలస్వ నంబుతో నిచ్చటం బాడుచుండం గతమెయ్యదియో!. ఈ వివ రము లెఱింగి క్రమ్మఱవత్తువా? ఈక్షణము తదాయతనవాటికిం

బోదము." అని యనుప నాక్షణంబ చని యా వినోదసఖుం డచ్చటి పూఁ బొదరిండ్లు, గాంచన మణికందరాసదనసంతతులు, బరిపక్వగోస్తనీ ఘనతరకాయమానములు, దిన్నని కన్నెమావి గుంపునఁ బెనఁగొన్న మల్లియలు, పూచిన కోనలుం గాలించి బండిగురివెందతీవచప్పరము లెనసి ముడిగొన్న ద్రాక్షపందిళ్ళ నడుమఁ గిన్నరీనాదానుకారి శుకశారికాదిఘోషల ఘుమం ఘుమితమైన యొక్క కోనం గనియెను. అందొరగంబడి ప్రాలిన ననేకువుల పుప్పొడి సారువులవెంట సహకారమిళ దేలాధార ములందు జాఱు హిమవారిసారుణులచేఁ బైరయిన చెంగలున యోరికలలోఁ గాశ్మీరకృతసేతువుల వెంటఁ జనునెడ నచట నిద్రించు కలహంసములు బెదరి రొదలుసేయ బెఱవార లిటఁ జేరి రని కీరములు సారెకుఁ జారణులం జీర నవ్వుసువినసఖుండు చని చని యొక దివ్యమందిరముం గనియె.

పగడాల ముంజూరుల నిగనిగలు వజ్రాలవేదికల క్రేవల నెఱజాజునింప, నీలాల జాలకములకాంతు లఖండ కాలాగురు ధూపకాంతులకుఁ బెంపుఘటింప, ముత్యాల నవరంగములరంగు ననరంగవల్లీ విభూతి ముంగిళ్ళనుంప, గారుత్మతద్వార చారు ప్రభాపూర తోరణముల హరిత్కాంతులు మెఱయ, భగ్న పాంచాలికా పాణిసద్మరాగరాజి నీరాజనోపచారములు నెఱప నిరుపమానంబైన యమ్మణిమందిరముం గాంచి కలధౌతభిత్తికా ముకురతల బహిర్జని తానుబింబనములచే నయ్యాది మెలఁతలు మెలంగు నెలవని యెఱింగి కొనియెను. అచటి తెరువుల పొంతఁ బొంచి యానసుధావరమిత్రుడు దమోవినీలకచయుఁ దామర

సోదర సోదరప్రభయు దరళవిలోచనయుఁ దానసోసోంగయు, దంతి
న్నిభగాత్రవల్లరియు దరుణశశాంకఫాలయుఁ దనంగపళియుఁ
దలోదరియు నగు నొక తరుణిం గాంచెను. లలితాతానలతా
వితానవృత తీలాచంద్రశాలా తలోజ్జ్వల నీలానల వేదిపై
మొగిలుకైవ మించు క్రొమ్మించుతీవయో యన నన్నె
య త్తటి న త్తలోదరి వీణావాదనప్రౌఢిచేఁ జెలుల నలరింపఁజేయుఁ
చున్కి గ్రహించి యానృపసఖుం డిట్లని తలపోసెను.

ఈ తన్వి తన కప్పెల్ల కొప్పునం జే ప్లాని గౌరీసమాఖ్య
మించ జనించిన యార్యయో, తన చూపులమెల్లఁ జూపు
లందే చూపి యెల్లకడల సిరులం జల్లవచ్చిన కమలపాణియో,
తన పాండిమ మెల్ల నవ్వులందేయుంచి గాంధర్వము సనసికిఁ
దెచ్చిన హంసయానయో, తన యదృశ్యతయెల్ల నడుమునే
తాల్చి సాంగయై మొనపిన యతను సమ్మోహనవిద్యయో
కావలయు. దీని కాంతిగుణ కళాభిరూప్యంబు నెఱిం
గించి యామహేశు, నానగోద్ధారకు, నా ప్రజాధినాథు, నా
జగన్మోహను నిదెకొని తెత్తు". ఇట్లు నిశ్చయించి యా
రాజుం జేరి యిట్లనియె. "బలశాసన సన్నిభ! నీ పంపునం
విని చని చని తీవగుంపనక, పాండువ సైతక నిద్ర నిరాలంబనసి,
దరీపుటంబనక చపన్నియ నరసిజుచిసి వినూతనలపల్లీల
తావుల తావలమైన యొక్క తావున నొక్క . కోసనంగంచి,
నాళీకాకర తీర సాంకదళీనారంగ పూగానళీ చూళీనానిత్యాపన
యాకొనలో గానలోలాళీప్రేరక రత్నకొంరక నుయుయుఖాళీ
సమాలీఢమగు నొక్క కేళీధామముఁ గంటిని. ఆ కేళీసవానము

నందు సమేళమునైన సారెలపై లలితాంగుళీదళంబులు రాగ సంపదలిడుచుండఁ బాణికంకణ రుతులు ప్రాణానుబంధముగల తాళగతి కనుగ్రహము లీనుచుండ, నత్యుక్తసంవాది సమస్వరంబుల కాలాపభంగి గ్రామము లునుపుచుండఁ బ్రచురములగు తానామృతముల మూర్ఛనలచే నచేతనములఁ జేతనములరీతిగఁ జేతనముల నచేతనములభాతిఁ దనరఁజేయుచు వీణవాయించు నొకయలివేణిం గంటిని. నరరాజకన్యకలుఁ గిన్నరరాజకన్యకలు ఫణాధరు విద్యాధర పీణాధర శోణాధర లెవ్వరు నాతరుణిం బోల్పఁదగరు సుమా. జమ్మేటి యసటఁ గ్రొమ్మించు మించుఁ బోదివి మదనప్రతాపాగ్నిఁ బుటమువెట్టి తన్మిగద్దియ దాకటఁ గ్రమ్మి తమ్మిచూలి యాకొమ్మఁ గావింపఁబోలు. వదన వనజహృతాంశు సర్వస్వుఁడై కుందుచున్న యిందుని దరహాస కందళముచే మనుపుమా యని పాదములవ్రాలి వదలి చనని విధుసి కొమ్మలోయన నయ్యింతి మృదుపదనఖాంకురము లమరును. అక్కాంత లేఁగౌను నాభీగుహాచెంత నారుపొగలాని యాయసంగుని మెప్పించి తదాత్మతం బొరయఁగాఁ జూపఁజాల కుజ్జృంభిత స్తనయుగ్మంబును సతనుత్వమందెను. అధరోష్ఠంబు సిక్షుధర్మ స్థితిం దనరెను. కన్నులును శంబరాహితగతిం దాల్చెను. మహాక్షికములు, విభ్రమరేఖలుఁ గలవ్రగదా యని యాకోమలి కంఠలక్ష్మికి సాటిరాఁ గోరి మహోద్ధతిపై మొరసి యామె మృదునాదవిలాసకౌశలం బలవడమి ముడింగి దరమై తనలోఁగల వివరమెఱింగికొని వలమురి యాకన్నె కంఠమునకుఁ బ్రదక్షిణము వచ్చెనో యనునట్లుండెను. ఆకొమ్మ వా తెఱతో

గుణముఁ గైకొననచ్చి కఠినవిభ్రమమము చేకట్లంబడెను. ఆకోమలి యధరముతో మొనలు పచరించి యరుచిబింబఫలము లవిసి పడెను. ఆమృగనేత్ర పెదవితో సొగసుఁబూనఁ గఱంగి కెంపు సోనసముఁ జెక్కించుకొనెను. ఆసతి మోవితో రసస్థితులుచూపి సుగంధ వికచమగు బంధూక మూరక విరిసిపోయెను. అహాహా! ఆ కుందరదన రదాంశుకము డాయు పగడంబునకుఁ బగడంబు, బింబమునకు బింబము, మెఱయు కెంపునకుఁ గెంపు, బంధుజీవనమునకు బంధుజీవము నగుచున్నది. అయ్యింతి మృదూక్తిమాధురి కెనవోలఁ జాల కిక్షురసం బాద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమై నెఱకాఁకల నెన్నిజన్మాంతరములు వహించినను దనంతఁదానె ఖండములయ్యెగాని యెంత పోడియయ్యు నఖండమగు నామె యుక్తిమాధురీసంపద నావంతయుఁ బూనఁజాలదయ్యె. నానా సూనముల వాసనల నానందించు సారంగమేలా నన్నొల్లదని బలుకాకం దపంబంది గంధఫలి యయ్యావనాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై యమ్మొఘకరీపుంజము నిర్వంకలం బ్రేక్షణమాలికలుగా నొనరించుకొనెను. త్రిజగతీ మదవతీ రూపవిజయకీర్తి గలుగునని నలువయచ్చెలువఫాలమున వ్రాసి యాశుభవాచకముల మొదలందుదిసి శ్రీకారముల నిల్పెనా యన నామె కర్ణములమరును. ఆహా! ఆమె సౌందర్యము వర్ణింప నేరితరము? ఒక్కసారి యక్కోమలి చెలువము దిలకించితివా చాలును.

ఆసుందరి యంద మటుండనిమ్ము. ఆచెలువ చెలువల చెలువముం దెలుప నాతలమా? ఆవామాక్షి వలనఁ గలికి

మాంపులు, సనవద్యగాత్రులు గలిగిన సముదెంచిన సురాధిరాజ కన్యలా యని శంకించెదిని. అట్టి లావణ్యవతీమణులు గొలువ నా లేమ యాకోనలోని యా లీలాభవనములో ఘనఘనకంఠా లాపములు వ్యాలోలాంగుళి సంజ్ఞచేఁ గలిసినరీతిని వీణఁబల్కించు నయ్యాలాపమే గిరిదరీముఖరమై మన కాలింపనయ్యెనుమా. స్వైరవిహారధీరులగు సారసలోచన లున్నచోటికి లాతివారు పోఁగనఁ జొరఁబోయిన రసభంగమగునని నే నవ్వారిం జేరం జనక పువ్వుందీవెల పొంతనే పొంచియుండి యాలతాంగిరూపు గన్నారఁగాంచి నీకు విన్నవింపవచ్చితిని". నెచ్చెలియిట్లు విన్నవింప మున్ను విన్న యా గానముకన్న నా హితవాక్యము మిక్కిలియుఁ దిన్ననై యన్నీరజలోచనయున్న కోనకుం జనఁ దివిరింపఁ బ్రియావచస్స్థితికన్న మిన్నయై మనోజభుజచాపలతా గుణగుంజితార్భటు లజ్జనపతి కరాళంబగు విరాళినించెను. కిన్నర యుగళిచే మున్నువిన్న యాసన్న శుభద ప్రసన్నఫణితి మదిఁ దాఁక ముదమునం బొదలి యమ్మేదినీపతి హితాగ్రణిం ద్రోవ సూపుమని యాదేశించెను.

"దేవ! జవాది సేఁరాళంబగు నీ త్రోవఁబోరాదు. ఇయ్యారాలచక్కి నేఁగుటమేలు. ఈ కాన నేకాలముం దేనియ వాన లుడరుంగాన నా కాన నేర్పున నరుగవలయును జుమా. ఈ వంక నేవంకను దుహినము లే. పూఁదెప్పల నీవంక నీఁదవలయును. ఈమూలనన్నియు నున్నని మూలల బామొత్తములచయిలే. కాన నామూలలముగఁ దీవలంటి నడువవలయును. ప్రభూ! ఇదిగో ఇదియే మానికపుంగోన. అదె లతాంతరజము సారువ. అల్లదే

కప్పురంపుటనంటి చప్పరము. మఱియు నల్లదే యాకాంత యేకాంత నిశాంతము" అని యిట్లు చెప్పుచుం జూపుచుం ద్రోవతీసెను. అనుంగు నెచ్చెలి నంటి యల్లనల్లన నడచు వల్లభున కల్లంతదవ్వుల నవ్వుల నడుము నాడు నాడువారి యాలాపంబు లిట్లు వినవయ్యెను. "ప్రకటితోన్మేషయగు నీ పద్మిని కినకరకౌతుకావాప్తి వేగమే ఘటిల్లులేవే. తతవరోా విభవయగు నీలతకూన కాసన్నపున్నాగవిభ్యాతి గొబ్బుననే యబ్బుగదే. విలసితామోదయగునీ కలికిక్రొమ్మకు రాజసారంగ యోగ మీాక్షణమే కలుగుసుమా. భువనాభినంద్యయగు నీ నవరస సరసకి మానసప్రియలీల తోడనే దొరకులెమ్మే."

లేఁదోఁటలరయు నమ్మగువల పలుకు లుపశ్రుతి మధుర ములైనగపతి సలరించెను. కుతుకమున నచలసుతయగు సతిఁగనఁ జను రాజహంసాళిగతి నీరీతినాక్షితిపతి సతిఁజూచుతమిచే హితసూచితమగు తెరువున నడుగుచుండ నల్లంతదవ్వులఁ దోలుదోఁత భద్రకుంభములు నాపైఁ బచ్చతోరణానికవుం బచ్చతోరణ ములును గన్నులకు దోఁపించి యక్కన్యాగృహంబు రాజన్యున కమూల్య కళ్యాణగరిమం దెలిపెను. అంత నక్కాంచన మందిరము నవరత్నాలోక ముల్లోకమై యాలోకనోత్సవ మాచరింప భూపతి డాయంబోయి ప్రాచీనవుం జాలుం దివెల చాటున నిల్చి వాచాలాళి పక్షానిలాలోలత్పల్లవ జాలకముల నాలోలాక్షి నీక్షించెను. ఈక్షించిన మాత్రన నాసగ రాజశేఖరికి కనుంగవ పూర్ణకామమయ్యెను. కనుఁగనకన్నఁ బూర్ణకామమైె మన మతిచిత్రవృత్తియయ్యెను. మానసవృత్తి

# ౮

ఇట్లు మాయతపస్వియైన వసురాజసచివుఁడు నియమస్థేమాయతిశ్రో నక్షసరముం ద్రిప్పుకొనుచు నా వామాయతనయనాజనమున్న హైమాయతనముం దరియ నరుగునెడ "మగువలార! గంధగజయాన గీతప్రబంధకలన నలరి యతిలియ్యమైవచ్చు రీతిం గంటిరా?" యని యొక చెలికత్తె పలుకు పలుకులు వినవయ్యెను. ఆతండు నిదె యద నొదవెనని తలంచి "లతాంగి! మేలు! నీపలుకు మెచ్చితి. యతి వచ్చుజాడ నేలీల నెఱింగితివి? బహుళీకృతచాతురి నించు నిట్టి విపంచీ లలితారవామృతము చిత్తము సోఁకిన వారెవ్వఁడు నీకళాశాలిని జూచి దీవెన లొసంగక పోవఁడుసుమా" యని పలుకుచు నాలోలాక్షుల సమక్షమునఁ బ్రత్యక్షమయ్యెను. అయ్యిందుముఖులందరు నాపలుకులాలించి "నిక్కమ యెక్కడనుండియో యొక్క యతీంద్రుఁ డేతెంచెఁగదమ్మా" యనుచు లోలో నచ్చెరుపాటు సంభ్రమమునందుచు గద్దియలు దిగిరి. తటాలున సమున్నత పీఠము డిగ్గి నిల్చు నాగరిక నిజుఁపేద కొను వక్షోజ

గౌరవ మోర్వీక కంపమొందగా ససంభ్రమ సంభరితానుకంపమై యజ్ఞనపతి చూడ్కి యామె వలగ్నముం దటాలునఁ బొదివిపట్టెను. ప్రభువులెప్పుడును దీనదయాళు దర్శనులుగదా! అయ్యింతియు నంతంత నెదిగి పొదలు గుబ్బల యుబ్బుకతన నొరగాఁ బాణికంజంబు లూఁది సఖీమణులుం దానునునమ్మౌని మణికిఁ బ్రణామంబాచరించెను.

అప్పు డత్తపోనిధి యొప్పులకుప్పయగు నప్పూఁబోఁడి వినయకల్పనంబులకు నుప్పొంగి "ఓయనన్యసామాన్య లావణ్య ప్రభావ సువల్లభుం బెడ్లియాడు" మని దీవించి తదీయ వివిధ పూజావిధానంబులం బ్రమోదమానమానసుండై యమ్ముద్దియ లిడిన పసిండిగద్దియ నధివసించెను. అయ్యెడం దొయ్యలు లయ్యతి పనుపునఁ దమతమ యుచితాసనము లలంకరించిరి. అంత నాకంజనయన యనుంగుంజెలులలో సమంజస వచన రచనా చాతురీరంజిత యగు మంజువాణి యంజలి వట్టి యతి కుంజరునితో నిట్లనియె. "ఆర్యసన్నుత ! తామెచ్చటనుండి యెచ్చటి కేఁగుచు నిచ్చటికి విచ్చేసిరో! భవచ్చరణాబ్జనఖేందు యుక్తిచే నచ్చపుందెలివి వచ్చెను. తమ మంతయు విచ్చెను. కళాకలాపములు హెచ్చెను. ఇంక మదాళిభాగ్యము లింద్ర పురంధ్రులకైనం గల్గునా? అంబురుహాప్తతేజ ! శిష్టకోటికి భవదంఘ్రుల ప్రాలం గలుగు నుత్తమాంగమే యుత్తమాంగము. జగన్మహనీయ భవత్కథా విశేషము నుతింపఁగల రసజ్ఞయే రసజ్ఞ. భవద్విభావనాప్తిఁ బరిపూర్ణమై జరుగు దిష్టమే దిష్టము. ఈ లలనాలలామ వీణాకలనాదము మెచ్చి కమనీయ

వరాకలనాదరమున వచ్చిన యల నాదప్రియుఁడ వేమో తెలుపుమా మహాత్మా! అతులప్రభావయుతుఁడవై, యతిలోకమణివై యనంత రత్నాయత తేజుఁడవగు నీ శుభాంకము గన్నసువర్ణరేఖలం దెల్పుమాకుం గర్ణయుగళీ పరిష్కరణ లీల ఘంటింపుమా!"

నావుడు నమ్మునిరా జిట్లనియె "ఓవనితా! జనతా వినుతాభిధేయుఁడై యొనరిన మునికులోత్తము గౌతము వినియుందుగదా! అనఘమగు నాతని యన్వయకలశాంబుధిం బుట్టినవాఁడ. గౌతమాఖ్య నెసంగువాఁడ. పరమహంసరస ప్రతిభానుభావుండ. ఓవలమానమీన మిథునోపలనోల విలోచనాంత! ఉన్నతనగాహితపాదసనాథుఁడును, నాత్మసంసేవక శేవధియునగు వసునాథు భజించి తదీయరహస్యమంత్ర సంభావనచే నద్భుతముగా ననాదిమునిమార్గముఁ గాంచితిని. ఓనాతి! వినుము. పిన్నటనాఁటనుండియు నేను దదంఘ్రిసేవావృత్తినున్నకతన నయ్యానందు సకలపదముల నాత్మానుసరణమహిమ నాకొసంగెను. కావున నుద్యానగతుఁడైన మత్స్వామికోన మేరుసమేధమానమంజులచ్ఛాయలఁ గరంబలరుచు, నీలగ్రీవనిలయాభిరామ సీమలం దెలియుచు, సుమనోమనోజ్ఞ ధామములు మెచ్చుచు, బుష్కరసరోవరోర్మి సంభ్రమముగనుచు, రంభాది లాస్యసంరంభము లీక్షించుచుఁ, గిన్నరమృదుధ్వనులు వినుచు, శిశిరశిఖరస్థలంబు లవలోకించుచుఁ, జంపకారణ్యా మరయుచు, నద్భుతంబైన పుండరీక కేదార వైఖరిం గోరివచ్చివచ్చి సరసదరీఝరీ వికచసారస సౌరభసార పూరితాంబరమగు నిమ్మహా

నగము పజ్జనె యీ నవపద్మినీ మనోహరుఁడు వెలుంగుచుండు టచే నాయన కిట నుపాయనముఁ గూర్చువాఁడనై పద్మినీసమ నయం బరయుదుఁగాకని పచ్చితినని వివరించి మరియు "అను పమభాగ్యలక్షణసమన్వితయు, మనసిజరాజ రాజ్యరమయునగు నీరమణీలలామ చూడంజూడ సింధునందనయో, యచలేంద్ర నందనయో యనిపించుచున్నది. ఓచెలువా! చెలువార నీ లతాంగి పావనకుల గోత్రభూతిం దెలుపుమా" యనియెను.

ప్రౌఢ వచోఽనుభావముల ప్రోవై మించు నవ్వాంచనా యతి యాదృచ్ఛికసూక్తికచ్చెరువంది యన్యోన్యాననా లోక నాయత నానాద్భుతలీలలం దేలి యీ శతపత్రేక్షణ లెల్లరు నుల్లముల విశ్వాసము సంధిల్ల నమ్ముని మాహాత్మ్యముఁగొని యాడిరి. అత్తరి నమ్మంజువాణి వినయమ్మున నమ్మునిరాజున కిట్లనియె. "ఆర్య! సర్వలోకభరణా భరణాత్మ మహోమహో జ్వాలుని నెయ్యముమీఱఁ గొల్చి మహనీయశుభోన్నతిఁగాంచి యున్నమీకీ యఖిల ప్రపంచ కథలెల్ల నెఱుఁగఁగల్గు టేమి చోద్యము! అనుపమ భాగ్యలక్షణ సమన్వితయు మనసిజరాజ రాజ్యరమయునగు నీరమణీలలామ చూడం జూడ సింధునందన, యచలేంద్రనందన యనిపించు చున్నదని తెల్లముగఁ బేర్కొ నియుఁ గ్రమ్మఱఁ దెలియఁగోరుట కేవలముం గూరిమి పెంపున నేకదా! కావున నీవనజానన పావనజననక్రమము భవదీయ దయార్ద్రశీలన విన్నవించెద వినుండు. కలఁడుగదా! ఉల్లోక మహోమహోగ్ర హుతభుగ్జ్వాలావళీ నిర్జలస్థలదంభోనిధిలక్ష్య హైమవత పక్షచ్ఛేద దక్షోరు దిగ్వలభీదుర్భర భేరికాభయద

భాంకారైక సంప్రీణితాచలవైరిస్తుత కీర్తిసాంద్రుండగు వసుక్ష్మాపాలచంద్రుఁడు! ఇంద్రునకు స్వారాజ్యముఁబోలె నారాజేంద్రున కారామస్మయమాన నూనమకరందాసార శైవాలినీ ధారావర్ధిత మాధురీగుణ లసత్కాంతార కాంతారమును నిత్య శ్రీలతావాలమునగు నధిష్ఠానంబధిష్ఠానంబై యింపునుసొంపునుం బెంపుచుండును. రత్నభూషితయగు నారాజధాని యఱుత నురుతర ముక్తాఫలాభిరామదామమో యన నిద్దంపుఁ జవుల మివులు శుక్తిమతీనామ భవ్యతటిని యలరారును. కోలాహలాఖ్యుండగు హిమవన్నగనూతి యన్నదీమతల్లి గామించి గద్దరితనంబున నాక్రమించుటయు నాశ్రితరక్షాదీక్షితుండగు వసుక్షితీశుం డాగద్దఱిం దన కొనగోట మీటి యద్యోటికి శైలావరోధముఁ దొలంచుటయు జగద్విఖ్యాత గాథావిశేషంబ కదా! ఆ నగజాత యీ తరుణి. ఆ వనదేవత లీవయస్యలు. ఆ మానవనాథ పాదనఖ మర్దితభూధర మీనగోత్తమము. ఈ నగమహాళిపై నెసఁగు నీమణిధామములు, నీకొలంకులు, నీకోనలు, నీనికుంజములు నీకుంజరయాన విహారరంగములు."

అని యాజవ్వని యుపరిచరవసునాథు కథయుఁ గన్యజనాగతియు వినయమున వినిపింప విని యమ్మౌని సమ్మదాబ్ధిం దేలెను. ఇంతసేపు లతికాసంవృతగాత్రుఁడై నిజకథాలాపంబు లాలించు భూపతి నర్మహితు నేర్పును, నబ్బోటి వచనప్రాగల్భ్యము, నకన్య యున్నతగోత్రోద్భవ వైభవమును దన మనమున వర్ణించుకొని యా శుక్తిమతీఝరీజనితరత్నం బాత్మవిత్తంబుగా నూహించుకొనియెను. అమ్మౌనియామహానియు నంతఁ

గొంతతడ వాత్మధ్యానవిజ్ఞాన ముద్రాయత్తమున నున్నట్లు నటించి యాకాంతారత్నముం గాంచి యిట్లనెను. "ఓ! లేమా! మే మాంతరదృష్టితో నీ భామాభావిభాగ్యోదయముం గాంచితిమి. ఈ యబ్జాననను వసురాజేంద్రుఁడు వాలయముగాఁ బెండ్లాడును. ఇట్టి కాంతారత్న మమరఁజేసిన విధాత దీనిని వసువుతోఁ జేర్పఁజేని నాతని నిసర్గమధుర సర్గానుభావ మఖిల భువనప్రసాధనం బగుటెట్లు? నెలఁతలలో నీ కులగిరిరాజకన్య త్రిలోకనుత నిర్మలరూపకలాపధన్య. నృపకోటులలో వసురాజు మేటి. ఈ లతాంగియు నయ్యలఘుఁడును దావియుంబూవును బోలి యేకమై వెలయుచుండఁ గాంచుభాగ్యము మాకు వేగమ కల్గుంజుమా."

అనిన నమ్మందయాన సందియమందుచు నిట్లనియె. "మునిచంద్ర! వసువసుధేశ్వరుం డిన్నగరాజుఁ జూడ నెన్నఁడు వచ్చునో? ఈ క్రొన్నన తీవజొంపముల కోనకు నెన్నఁడు డిగ్గునో? ఈ కన్నియం గుతుకంబునఁ గన్నులార నెన్నఁడు గాంచునో! కాంచి తా నెన్నఁడు గారవించునో! చెలులెన్నఁ డభీష్ట సంపదలు గాంతురో!' అని వెండియు నాజవరాలు ప్రియమున నామునింజూచి "ఓతపోధనమణీ! ఈ లలితాంగి వసుధావరు నెన్నఁడు చెట్టవట్టునో యని యనురక్తి పెంపుమోయి నాడితిఁ గాని యియ్యంగనకు శుభప్రసంగము నొసంగ భవద్వచనము ముంగొంగు పసిండియకదా!" అనియెను.

నావుడు నాజడదారి "ఓలలనా! ఈ యెలనాగను జేది క్ష్మాతలనాథుఁడు వాలాయముం బెండ్లియగు. ఇది నమ్మవేని

నాసల నాసత్యసమాను నామంత్రిపోషీ రప్పింతునిదెచూడు’మని మాయాజపాకలనాదంభముపూనిదిశలాకర్ణించి ‘మఘ్జా’ యనెను.

అంత నా వసురాజేంద్రుఁడు సంధింప నిదే యదనని సారంగరాగభ్రమన్మదభృంగీరుతి వందిమాగధకథా మాధుర్యముఁ దెల్పుచుండ నీరంధ్ర నీరదవార ప్రతినీర వెల్వడు తారాభర్తలీల లతాచ్ఛదసంఛాదికఁ బాసి వారియెదుట నిల్చెను. తలిరుఁ బ్రాయమువాఁడును, వలరాజు నలరాజును నలరాజును దెగడు సోయగమువాఁడును, బసిఁడిచాయల వాఁడును, బగడంబు జగడంబు జగడంబుగల మోవిసొగసువాఁడును, దళుకు చెక్కులవాఁడును, దులకింపు బలుకెంపు పలుకెంపు లోలయు నవ్వోలయువాఁడును, జికిలి చూపులవాఁడును, సిరి మించుదొరయించు దొరయించు కాంచనాంబరమువాఁడును, నొఱపు గలవాఁడును, మకుట కేయూరహార కటకకుండలచాక చక్యములవాఁడును, నగునమ్మహీజానిం గని యమిత వినయ సంభ్రమముదోఁప నయ్యాబ్జాతముఖులెల్లరు లేచినిల్చిరి. ఆక్షితి పాలోత్తముండును నంత సంతసమున నేతెంచి “చింతిత కళ్యాణ సమృద్ధిరస్తు” అని సన్మిత్రుఁడు దీవింపఁ గుతుకస్మేరముఖార విందుఁడయి కోర్కులుమీఱ నన్నారీజనార్పిత జాంబూనద పీఠిపై నాసీనుండయ్యెను. అనుపమ కాంతివైభవసమంచితుఁడగు నవ్వసురాజుఁ గాంచు పద్మిని సరసాంతరంగమున వినూతన రాగ కందళము మించెను. అఖండ వాసనలు బొదలెను. ఉత్కలికలు విలసిల్లెను. ప్రమోదతరళస్థితులై తమిఁజూపు తుమ్మెదలల్లనల్లన నిగిడెను. విలోలగతిం దొలుతఁ దొంగలి

తెప్పలనాని యల్లనఁ గర్ణకుండలరుచి ధాళధళ్యముల దాపుస మించువై పొంచి వెలుపడి వెన్నెల పుల్గులచాలు పూర్ణచంద్రునిపయి వ్రాలులీల నన్నవలానవలాలిత దృష్టిజాలము లవ్విభుమీఁద వ్రాలెను. అవ్వసుధాసుధాంశుం బొదువుచు, వెస మఱలుచు, మరలిమగుడ వెడలుచు లలనాలసమాన దృష్టిజాలము లసమాంబకు చిత్రశరములై విలసిల్లెను. ఆవనజాక్షి నిడువాలికచూపు లనిమేషవృత్తిచే నాఘునునవకంబు పైనొలసి తదీక్షణజాలకము పైకొనఁ దర్పాబ్ధిఁ గ్రుంకియు మోహనగుణశక్తినివ్వటిలు నవ్వాలరాయని నేర్పుపెంపునఁ గోరికస్సైఁగూడఁ బాఱును. కౌతుకమున నొండొరుంగాంచఁ దివురు నచ్చంచలాక్షికిని బతికిని గోర్కులు దలిర్చునట్లు వలరాచయొజ్జ నేత్రాంచలములం గూర్చెను. భావిశోభనవ్యంజకం బదియకదా ?

కన్నుగల వింటఁ జొక్కుపుంజవులు పుట్టించియు, నారిచేత విభ్రమోన్నతులు బెనచియుఁ, దమ్మితూఁపున రసోదగ్రత సవరించియుఁ, గంకేళిచేఁ బ్రబలరాగము నించియు, నెలమావిగేలంటి యెలమి మీఱఁగఁ జేసియు, విరవాదిచే నూష్మాభివృద్ధి నెఱపియుఁ, గలువచేతఁ దమిపెంపు వెలయించియుఁ, జగురాకు మొనలచేనాకులపాటు మొనయఁజేసియు నిట్లసమశర వీరపుంగవుడాఁత్మ సాధనముల నన్నింటిచేఁ జూపి కమిచి పోటుగంటి దూఱినగతి నవ్వాల్గంటి మనమును నయ్యవనిపతి చిత్తమును నాక్షణంబ ప్రవేశించెను. ఆ యిరువురి హృదయములు సరసిమృదుగంభీర వచనరచనా పారీణత వెలయఁ బ్రేమమై మంజువాణి యిట్లు పలికెను.

"కువలయేశ! నేఁడుగదా నీరాక మాకనిందిత పర్వసామగ్రి సవరించెను! లోకైకమిత్ర! నేఁడుగదా నీయాలోకమహిమ మా తమోనివహము లడంచెను! రాజరాజ! నేఁడుగదా నీసన్నిధి మాకభినుతార్థములన్నియుఁ గూర్చెను! వసుధరేంద్ర? నేఁడుగదా నీపాదాప్తి మాకు మానితసౌమనస్యంబు లొసంగెను! సురభిచరితుఁడవగు నిన్నిచ్చోట భజింపఁ గల్గెఁ గాన మదీయ కాంతారాగలక్ష్మి సఫలతాకలితయై వెలసెను. ఇంక మానాతిచిర భాగ్యగరిమఁ బొగడఁ దరమా? సజ్జనావన గుణధుర్య! నే మనయము నీమహోవనము నందినవారమే కాని కడవారము గాముసుమా! నీ వినూతనవిజయాంక గేయములచేతను, నీ చాటుకథా సుధారసములచేతను బిన్నటనాఁట నుండియు మేమీ భువనమోహిని సలరించుచుందుము. అధిప! ఏదివ్యవాహిని యనఘామూల్య మణిప్రరోహముల నీ కర్పించునో, గౌరీపతికి హిమాచలమునట్లు నీ కేగట్టు విహారనగమై తగునో యట్టి శుక్తిమతియుఁ బ్రాలేయశైలేంద్రనందనుఁడును గాంచిన కన్యగా నీతన్వంగి నెఱుంగుదుగాక! ఈ యరుణచరణ సవ్యాహరిచందన లతాంతసరణిపైఁగాని యడుగువెట్టదు. ఈ యతిలలితబాహ కోరకిత పారిజాతవల్లరింగాని కేల నంటదు. ఈ సురభిళాంగి నవోదార మందార మంజులశయ్యంగాని తనువు సేర్పదు. ఈ మోవితీపులాఁడి కల్పపృథివిజ ఫలసంతతియేకాని పెదవిఁ జేర్పదు. ఈగిరిజ చల్లఁదనము గురుకులక్రమాయాతము. ఈతటినిపట్టి సరసగంభీరభావము జననైకరూఢము. ఈ నళిన సోదరీమణి మేని [illegible] సహజసిద్ధము, ఈ కన్నె పదమెత్తెనా

కలహంసలీల లోలుకును. అధరస్పందము గావించెనా శుభా
స్పదమగు రాగకదంబకము విరియును. శ్రుతిచూపెనా శ్రీవిలా
సము వెలయును. కేలు గదలించెనా సుకుమారపల్లవ నవైలా
లక్ష్మి వెల్లివిరియును. వీక్షించెనా షట్పది పొల్చును. ఆహా!
గేయవాక్ప్రౌఢిమ నీ కన్నెం గొనియాడఁ దరముగాదు. శ్రీనిధి!
భవదభినివిశన్యాసయగు నీ సింధుతనయ నేఁడీ హానిదనయా
మందరాగ మహిమము కలిమిని మహనీయ గుణశ్రీచే నుతి
కెక్కెను సుమా."

ఆపలుకుల కలరి భూపాలుం డిట్లనియె. "ముదితా!
విదితాతనుమంత్రజాలుఁడగు నీమునిఁ గొనియాడ శక్యమా?
సముజ్జ్వలరూప కలాపయగు మీా యనుగువయస్యఁ గాంచు
సుకృతాతిశయం బవలీల సమకూర్చిన యాతఁడు మాకుం
బరమాప్తుఁడుగాక మునీంద్ర మాత్రుఁడా? మఱియు నీతని
మంత్రప్రభావంబున మాకు భవాదృశ దివ్యభామినీ మృదుమధుర
కోమలాలాపంబులు వినంగలిగెఁగదా!" అని యమ్మనుజపతి
బహూకరించుటయు, నమ్మౌని సమ్మదమ్మునఁ గొమ్మ నెమ్మొ
గమ్ముఁగాంచి "తమ్మికంటి! అకుంఠిత భువన నిర్మాణ చాతురీ
ధురీణుండగు పితామహుం డేతాదృశయోగ్యవస్తు యోజ
నంబునం బొగడువడసి, యపారపరీవాద పారావార భంగంబుల
మునుంగడు సుమీా. అదియునుంగాక తదీయఘటనా వైభవా
భంగరంగప్రసంగంబునకుం బూర్వరంగంబు రసోత్తరంగంబగుట
యెఱింగితివిగదా. ఇంక సందియంబు వలవదు." అని వీడ్కొని
యవ్వసుంధరారమణునకు నవ్వారాశోహాకు నమూల్యకల్యాణ

కౌతుకసమృద్ధి గానలయునని దీవించి వారల వినయసంవిధానం బుల నానంద మొందుచు మణిమందిరము వెలువడి యథేచ్ఛం జనియె.

అట్లు చని యనతిదూరమునఁ దోరములగు మందార తరువారముల యీాలముల సారంబగు తపోధనాకారంబు డించి యథాపూర్వమగు వేషమున రాజు నన్వేషించు క్రమమ్మునఁ గ్రమ్మఱ నేతెంచి యమ్మహీమండలాఖండలుం గాంచి యద్భుతంబు నటించి పరిసరంబున నిలిచెను. అయ్యవసరంబునం బడఁతు లా రాజసచివు పలుకుబడియు మోముచాయయుఁగని తొంటిమునియకా నరసి మందాక్షమందమందాక్ష లగుచు నగుచు లోలోన నాతని వచోనైపుణంబుల సంభావించిరి. కోలాహల శైలాధిప లీలాగతుఁడైన పతి యయ్యలీకయతిని నీలాల కానలోకకళాలోలత ననిపెనని యా వనితలు తలంచిరి. అపు డొక బాల యుల్లన మేలమున "నెంతులార! ఈ నృపమణి రాకచే నలరి యీా గిరికానన మిప్పుడెంత చొక్కుపుసిరిఁ దాల్చెనో చూడుఁడు" అనుటయు నక్కన్నియ సిగ్గును రాగ పుంధమియుఁ బెనంగొన మోమువఁజేర్చి కుచాంచలహార ధారలోఁ బ్రియుం గాంచుచుండెను. ఈ కీలెఱింగి యయ్యలివేణి నొకతంబ నెండియు "నో పొలతుకలార! యీా చిగురుబోఁడి కుచార్పితహార నాయకోజ్జ్వలరుచిఁ గంటిరే" యనుటయు నా చంద్రవదన లెల్లరు నానందమునఁ జిఱునవ్వులం బూనిరి. ఆలలసలం గాంచి కిసక్కుయుఁ, గలంకయుఁ గొంకును నంకురింప పొలసి యన్నాతులెల్ల దాంగి జిగిచూపు వెలుంగులచేఁ గలధ్వనులు

గల కలకతులంగదిమి, గాటంపునెమ్మినటింప, హంసకంబులు
జడియఁ బయోధరసమున్నతిచే భంగురమధ్యపుష్కరాంచల
మందోషఁ జాయఘనప్రతిసీర చెంతకుఁ దళుక్కున నరిగెను.

ఈ పగిది నాపరమాణుమధ్య తెరమఱుఁగున కరుగఁగాఁ
బరమానురాగ సూచనపరమానసుఁడై తనివిదీరని చూడ్కుల
నాధరణిపాలుం డిట్లనియె. "సఖులారా! మెఱుఁగొప్పు నెఱి
గొప్పు జలదమాలికచొప్పుఁ దెల్పుచున్నదిగదా. వాలుగల
నేలు తెలివాలుగనుడాలు కలువపూఁదెరమేన నిలుపుచున్నది
గదా. కళలీనఁగల లేనగవుసోన కలశాబ్ధితెర మేన నిలుపు
చున్నదిగదా. మఱి యీబాల నెయ్యంపు టలుకంబూని యేల
యీవిశాల యవని కాభ్యంతరమున కరిగెనో?" నావుడు
నమ్మంజువాణి నెయ్యమున ననుంగునెచ్చెలిం జేరి యభినవా
లోకనోత్కంఠనధిపుఁడలర నీయలయుఁబోఁడి సమగ్రలజ్జానుభావ
భావమై తెరమాటునం బగటుసూపఁ జూపటుకుఁ బరిణయ
స్ఫూర్తి దోఁచుచున్నదని యుల్లసమాడెను.

ఆవక్రోక్తుల సైపనోపని దానివలెఁ "గల కాకుఘోష
మొనరించు మదాళిని పక్షగౌరవంబెనయ నదల్చి, మంజుగతిఁ గో
సీనజాతములో మదీయ ఖేలనములకెల్లఁ దోడయి మెలంగ నా
జవని వయస్య కలహంసి రాదొకో" యని యానగజాత నెమ్మన
మునఁ దలపోయసాఁగెను. అంతలోన నా కలహంసియు నచ్చ
టికి వచ్చి యచలాత్మజంగాంచి "కుమారి! తాపసానీకము నీ
కమూల్యశుభ నిర్వాహణము ఘటిల్లఁ గల్పకానోకహ సూన
రాజము లన్నూనమనూక్తులతో నొసంగినం గైకొని యవ్విరు

లిచ్చువేడుకఁ దల్లి నిన్నుం బిలువంబంచె. రారమ్మ." అను టయు నక్కమలికుచభారమున నడుమువడంకఁ బదకటకరఝుణ త్కారము లెసంగఁ గబరినుండి కుసుమాసారములు దొరంగఁ జనఁ దివురటయుఁ జెలులెల్లరు నెనరునం జెయివట్టినిల్పి యిట్లనిరి. "ఓ తరుణీ! ఈ ధరణీ సరణీపురందరుం డనుపక యెట్లు పోదువు? నగవాఁడిటెట్టఁ దగవా? ఓ మహీవల్లభ! మాచెలి మీఁది ప్రేమ నీ మనమునం బాయకుమా పోయివత్తుము" అని యమ్మానినిం దోడుకొని పోయిరి.

ఆయెడ నా శతపత్రేక్షణ వెంటనంటిన వసుధాపాలకాలోకమును దత్కాంతాచికురపాళీ నీరదాళీ మిళన్నృత్తి కేళీరస కేకిలోక గరుదుస్మిల స్మరుల్లోలమగు భవనప్రాంతోరు కాంతార వేల్లిత వల్లీనిచయముగూడఁ బ్రతిరోధింపఁ జాలదయ్యె. మాటిమాటికిని భావి వియోగ చింతచే వనరుచు వెంటఁ బోవు మహీవల్లభు చూపులప్రోవులో యనునట్లు ద్విరేఫములు వనతరువల్లికా కుసుమవాసన లొల్లక శైలకన్యకా ఘనఘన వేణికాభరము కన్నని తావికిఁ జిక్కి మ్రోయుచు నామె వెను వెంటనే చనుచుండెను. ఆళిహస్తావలంబనం బడర నడచు నక్కన్యనుఁ దదధీనవృత్తియై కాంచు నవ్వసుపతి నిరంతరాలోకవైభవమును గన్నిటిజడి సాగనీదయ్యెను. అక్కలికియుఁ బదాంగద ధ్వనికిఁగల హంసలుమూగిన నాఁగి నెయ్యపుఁ జెలువలఁ గూడఁ బిల్చు నెపమునను, లీలాశుకమునకుఁ బార్శ్వాలతాంచలముల ఫలములఁ దెమల్చి మిపచేతెను, నళిపంక్తికిఁ దనముఖము మలంచుసాకునను మాటిమాటికి వెనుదిరిగి యా నృపమణిం గాంచుచు నేగెను.

అనగభేదియు నానరాని మనోరథముతో నమ్మానినిం దనమానసమున నిల్పి ధృతిమాని నిరంతరబాష్పవారిఁ గన్గొనలం దాని యా నలినానన యేఁగిన జాడల నరయుచు మానికపుం గొనల నెలమావికానలం బ్రిమ్మరసాఁగెను. "ఇది యాబాల కమనీయ పదలీల గాఁబోలు నిచ్చటఁ బల్లవజాల మినుము డిరిచినది. ఇది యాబోటి కనుఁగొన్న వనవాటి గాఁబోలు నిచ్చట భృంగీకోటి రుచుల నెఱసియున్నది. ఈ వంక కలికి పల్కిన పొంకముగాఁబోలు నిచ్చటఁ దేనియ వంకలింక కొదవు చున్నవి. ఈచాయ కాంత నవ్విన చాయ గాఁబోలు నిచ్చట సూననికాయ మింపునింపుచున్నది. జూచితివా వయస్యా" యనుచు నయ్యారామ సరణిలో నరసియరసి నరపతి యాసరసి జాననం గానక బిట్టు సంభ్రమించిపోయెను.

ఆరామామణిమీఁది ప్రేమమున నీలీల నయ్యారామ సీమా సరోవారములెల్లం దిలకించి దుర్వారములగు భృంగా రావములచే ననంగరుజ పొంగార నరపుంగవుఁ డక్కురంగాక్షి శృంగారాగారమునకుం గ్రమ్మరివచ్చి గారామున నర్మసచివున కిట్లనియె. "వయస్య ! ఈమణీధామమా ధవళాక్షి యేఁగినంత శూన్యమై మదీయ మనః కంజాతముం బోలియున్నదిగదా ! ఆహా ! అయ్యతివ వెనువెంటఁ దవులనోచిన యచటి హంస వ్రజము శుచివృత్తిమై నెన్నాళ్లు తీర్థసంవాసము సచరించెనో ! అయ్యబ్జాక్షి ముద్దుమోవి చవిగొన నేర్చిన యిచటి రాచిలు కలు సురసాలముల నెన్నివరఫలము నొంది నిల్చెనో ! ఈసతి ఘోషముతావు లానఁజాలిన యిచ్చటి మత్తాళిసమితి సుమ

నోనురక్తి నెట్టి మహోత్సవములందెనో. ఈ కన్య ఘనకంకణక్వాణ గర్జల నలరఁగల్గిన యిచటి గంధాంధ బర్హిణగణము లెంత తపముఁ దుదిమీఱ నోఁచెనో” అని యమ్మహీజాని యున్నురున్నురసును. అమ్మాసలోచన మున్ను వీణవాయించిన చోటులం గాంచి రాగముపహించుచు, బోఁటులు దన్నల యింప నమ్మానిని మాటున కేఁగిన చోటులంగాంచి తమోమయత్వము భజించుచు, నల్లేగుచోఁ జెలులాయెలనాగ నాఁగిన చోటులం గాంచి చలాచలత్వము సందుచు నిట్లు పంచశరశాత శరాహతి నన్నరపతి సంచలించుటంగాంచి హితమంత్రి యీగతి సనునయమ్ములు పలికెను. “మహీకాంత! నిరంతర కాంతా చింతనచే నింత వింత నెగులు పూననేటికి? నీవు లలనానలినా స్త్రీడవుగదా! నిన్నుఁగన్గొనిన లతాంగి యీలువు మనోభవుం డింతలోఁ గొల్లలాడకుండునా? ఇంతకు నీకన్య నీకన్యగాదు గదా! అతివగుసుండా నీ పదానతుండు; తల్లియా నీశౌర్యరస పోషితజీవన! నెచ్చెలులా నిరంతరమునీకథలు వొగడుజాణలు; బాలయా భవద్విలాసమోహిత. ఇంకహితకార్యసంగతికియ్యెడ సందియమంద నేల! ఓ భూపాలావంతస! బాలాపాణిగ్రహ శుభ వేళానిర్ణితి కిపుడే విచ్చేయుము లెమ్ము”

అనవుడు నాశైలారి యలీకధైర్య చాతుర్యమున నయ్యగకూటాగ్రము నవరోహించి యాధోరణానీత గంధగజోత్తంసము నధిరోహించి వినూతనాతను పతాకాలోక సంప్రేక్షణీయ విలాసంబును, గజాధిరాజగమనో దారంబును, గాశ్మీర పత్రవిచిత్రంబును, దటిద్విభాసిరుచియు నగునవ్వాహినీజాతవైభవమునే లోవెలింగాంచుచు సంపత్ప్రేటియగు తన పీటికిం జనియె.

౫

ఈరీతి నన్నగవైరి నగరి కరిగి సింధురంబుడిగి యతి నలు ద్రిప్పు నారతులనోలెఁ దన మనంబు భ్రమింప నాత్మకేళీ నిశాంతముఁ బ్రవేశించెను. బడిబడిం బడంతులు సేరి జలకముల వేళ యయ్యెననియుఁ బళ్ళెరంబు వెట్టితిమనియుఁ దొందరవెట్ట నెట్టకేలకు ననాస్థతో యథోచితవిధు లాచరించి యొయ్యనఁ బూశయ్యపై నెమ్మేనుదార్చి పరిపరివిధంబులఁ జింతింపసాఁగెను.

ఆహా! గిరికన్య నెమ్మేన నేకీభవించినఁగాని తియ్య విల్తుని నిరోధింపరాదుగదా యని పొగిలి పొగిలి సగమగును. సింధుజాత నెదఁ జేర్చినగాని యిమ్మహీకాంశుఁ గనుసన్న మెలపరాదుగదా యని సాత్త్వికోదయదశానుభావములఁ జెందును. శుభవాణి యభిముఖస్ఫూర్తిఁ జూపినగాని యీపఱచుటంచలఁ గ్రిందుపఱుప రాదుగదా యని ప్రసవబాణ బాణమగ్నతఁ గాంచును. పద్మినిం గరముఖ్రఘ్రాణిఁ దేల్చినఁగాని యీ రేల ముమ్మరమ్ము వారింపరాదని యెంతయుఁ దాపము వహించును. ఇట్లునిశము నన్నదీ సుతావయవధ్యానాసక్తుఁడై యమ్మహీపతి

యయ్యేటి శోభనముక్తావళులన్న నే గోరంత నంటును. అన్నది నవాబ్జంబన్న నే యించుక ముఖర క్తినింపును. కాని యన్యంబేది యొసంగినం గొన నిచ్చగించడయ్యె.

నాఁడు నాఁటికి నిట్లు సుమనోమార్గణములకు వశుఁడై క్షమయెల్లఁ దద్గతంబుగావించిన యాభూరమణుని సాంగయశో జాలమో యన నాతని నెమ్మేనఁ బాండిమం బలరెను. "కోన కోటితోఁ బెనుగట్టు మీాటిన మేటికి నేఁడీ కన్యాకుచాద్రిగరిమ యెంత యరుదయ్యెను! గగన ఘంటాపథక్రమణశీలునకు నేఁడీ లతాంగి కౌనుచదలెంత గగన మయ్యెను! బలువెల్లికే యెల్ల నిలిపిన ఘనుని నేఁడీ సతిదృగంశుస్రవంతి యెంత సుడివెట్టెను!" అని విస్మితుఁడై కనికరించి యయ్యవనిపతి కాంతరంగికుఁడగు ననంగుఁడ య్యచలరాజపుత్రిఁదదధీనమానసాంబుజ నొనర్చెను.

పాపమా కులాహార్యనందనయంత నలసపవనజాలములఁ దూలగతిఁ దూలిపోయెను. తా నెంత యచలేంద్రకన్యయైనను వసుప్రార్థనమునఁ బలుచనగుట సాజమకదా! ఆ చెలువ తెలిచెప్ప ముత్తెపుజిప్పలఁ జిప్పిలి చనుకట్టుపయిం దొరంగు బాష్పధార యవ్వేలఁది మనోగతము |నరసి యవ్వార్తఁ దన భర్తయగు కోలాహలునకుం దెల్పనేఁగు శుక్తిమతియో యను నట్లుండెను. మనోవ్యథం బొగులు కూఁతు గ్రుచ్చికవుంగిలించిన తల్లి శుక్తిమతి తదీయ తాపశిఖలచే నామెమేన నింకిపోయెనా యనునట్లా కొమిరె మెయినెల్లం బిసాంకుర పరంపరలు, ఘన సారవాలుకా సముదయము, జలజాతదళములు నుల్లసిల్లెను. ప్రసవశరుండను యోగి పెక్కుభంగుల భావనలిచ్చి, మర్దన

మొసఁగ ధాతువేర్చి, రసము బలియించి నిశాంతమంతయు వసుమయము గావింపఁ దన్మయుఁడై యాగిరిక గళన్మణి భూషల గణింపదు; ఆప్తసఖులు చేరి పల్కినను బల్కదు; చూచియు జూడదు. ఆ కంజనయన విలోకన ఖంజనయుగ మెడఁద వ్రాలుటగని వసువాలో రంజిలుటెఱింగి శంబరభంజనుఁ డతి నిశిత విశిఖపంక్తిం బఱపి యగలించెను. పూటకొక కోటిశరత్తులుగా నుప్పతిల్లు నూర్మికలు శంకణాకృతి నొనర నన్నదీకన్యక వేణిదూలి సన్నగిలి యున్న గతి వర్ణింపఁదరమా? అయ్యలికులవేణి వలయాంకబిసాంకుర పన్నగాళికిని, జలమరి చల్లగాలికిని, జక్కెరఖాణపుఁ దేజిఁదోలు పూవిలుతు వయాళికిని, జిగురు విందుల నీలిగయాళికిని, హాలాహలగుళికాభయగు దుర్మదోఘునాళికిని లోఁగి యాత్మలోనిట్లనుతప్తయగుచుండెను "అమ్మక చెల్ల! తండ్రివలె ధైర్యవిభవము లేశముం గాంచనైతిని. జడజన్మనై తల్లివోలెఁ బైఁగమ్ము తాపహాతిం గ్రాగుచుఁ జిక్కిచిక్కి లోఁతుదక్కితిని. నిక్కముగఁ దండ్రిచాయ గల కన్యలు ధన్యలుగదా! తల్లియుం తండ్రియుఁ బెక్కువిధములఁ గామితములు ఘటింప నుల్లము చల్లనై సుఖించు నరనాగసుపర్వకన్యలం దొక తెగా జనింపక యొడ్ల నొంచు పెన్వెల్లికిని జాతికిని బాడమి యిట్లు వేటిడినైతిఁగదా! ఆహా! సోయగముగా వీణ వాయించుచుండ నమ్మాయాజటిలుం డచ్చటికేల రావలె? వచ్చెఁగాకేమి బాలా మనోభవు నవ్వాసుభూధవుం దలపనేల? తలఁచెగాకేమి యా ధరణీశుం దన మిథ్యాజపప్రౌఢిచే నటకు రప్పించి చూపనేల? చూపెఁగాకేమి యేనమ్మ

యూపారికాంక్షి దర్శిత వసుభ్రాంతిఁ జెందనేల? అయ్యో! నాతల్లి కౌటిల్య మెన్నండు దీఱు? తండ్రి హృదయ మెన్నఁడు కరఁగు? ఈ వియోగనీరనిధి నెట్లు గడతు? శృంగారవనికిం జనినఁగాని యువియెల్లఁ జక్కఁగావు." అని చింతించి సకియుల కన్ను మొఱంగి యమ్మధుకరచికుర నిజారామవాటిం జేరి ధాటిగల ప్రసూనాంబకుని శుకఘోటీనికరముల యాటీకనము నకు మనమున నివ్వెఱపడెను.

అత్తరి మణిమందిరమున బిత్తరిం గానక బోటికత్తియలు తత్తరంబడి "హా!గిరిసుతామణీ! ఎచ్చటికేగితివే?" యనుచు వనరుచుఁ జనిచని కేళివనకుంజములారసి యారసి యెక్కఁచోఁ జిత్తజభల్లభగ్నయై పడియున్న చెల్వం గనుంగొని సంభ్రమం పడి మందమందముగ నమ్మందయాన నిట్లు మందలించిరి. "కటకటా! మమ్మొక్క త్రుటియేనియుఁ బాయనిదాన వొంటిమై నిటకెటులవచ్చితమ్మా? ఇచ్చటి యాగ్రవేఁకపుఁ దేనె వాఁక లెటుల దాటితమ్మా? తెరువెల్లం బుప్పొడియకదా నీపదము లెటులోర్చెనమ్మా? ఇట్టి కడింది చెయ్దములు తగు నటమ్మా? హితాహితంబు లెద గణింపఁజాలని గోలవుగాన నిక్కడకు వచ్చితిగాక. అయ్యో! ఇచ్చటి యన్యపుష్ట చయ మును, మత్తమధుపవ్రజమును, బల్లవోత్కరమును, బాంసుల పంకజావళియుఁ బధికవర్గము నొంటిమైఁ దిరుగనిచ్చునా? ఫల భంగము లొనర్చు నీ చిలుకకు క్రోధరసము సాంగమై ముక్కు ననే యుండుగదా! మహాకాలమూర్తియగు నీ దంటకోయిల కెప్పుడు నెఱమంట కంఠమ్మునఁ గురియుచుండుగదా! సదంభస్థితి

యగు నీ మదమరాళికి ముఖరాగమును గళంబున విసంబును సాజమకదా! అలుకగొమ్మల తావులార్చి యాసవపూర్తి నెడలించు నీ యళికి మేనెల్ల మలినమకదా! ఔరా! అట్టి యుచ్చోటి కీయధర బింబముతో, నీ తలిరుఁగేలితో, నీ భుజా మృణాళికలతో, నీ పువ్వుకోమలాంగములతో నేలవచ్చితమ్మా! గట్టుదొరపట్టివగు పెల్లిఁ దెల్లమయ్యెఁగదా!

గురుద్వేషియగు చంద్రునకు విప్రయోగిహరణక్రూరుఁడగు మారుఁడు పరమాప్తుఁడు. కాంచన స్తేయతత్పర గంధానిలములును మహామధుపములును దదీయభృత్యులు. తన్మైత్రి చేతనేకదా పికస్వరము పంచమశబ్దము గాంచెను. ఇట్టి యిద్యోడకు సుదృగ్జాలము రాఁజెల్లునా?" ఈ తీరునఁ జెలులెల్లరు నక్కుమారిం దూరి ధవళాంబుజ భాజన రాజిపైఁ గుసుమాన్నరాశి నావటించి యాపైఁ జెందొవజోతి నిల్పి యవ్వనితకుఁ జుట్టిరాఁ దిగిచి సగంధ పలాశవాటిం బాయని యశరీరి బంటులకు బహు భంగుల నామెతలు గావించిరి.

అనంతరము మిళిందపుళిందావళికిని, వలికరువలి యావలికిని, నావలితహృదయయగు నక్కంజనయనం జేరి మంజువాణి భయాపనయశీలంబులగు ననునయ వాగ్జాలంబుల నిట్లనియె. "కలికి! ఈ యలకీరమండలి కలికి గోలనై యిటు చూడవేల? మాటాడవేల? నీదృక్కులకు వాక్కులకుఁ జాలకజాలింబడికదా యివి యీ కుజాలిం బడినవి? సకలాగమాంతవాసనలు గాంచి యిమ్మాధుకరకులము విముక్తకాంచనమై యున్నది. వర్ణిత్వము వహించి నిరంతర ఘీ శుకసంతతులు చూడుమ్ము శౌరి

నెట్లు పేర్కొనుచున్నవో! కన్నవారిం బెంచినవారిం గలయక యిచ్చటి వనప్రియచయము మాధవార్పితసూక్తి మనుటంగనఁ జాలవో! పద్మాసనాభ్యాస పరవశత్వమున బ్రహ్మాధీనగతులైన యీ హంసతతులం దిలకింపుమా! పాపము. పుష్పఫల పత్రి జలమాత్రముల శరీరయాత్రఁ గడుపుచు నన్మార్గ మధిగమించి జీవించు నివియెల్ల నీకెగ్గేల చేయును? నీకావంతయు నావంత వలదమ్మా! చెలీ! మనోజుఘాటికింత దలఁకం బనిలేదు సుమా! ఏలందువేని వినుము. ఈసారసకైరవములకుఁ జంద్ర దినేంద్రుల వైరము కలదు. ఈ యంచకుఁ నపారమగు మందగతి భారము కలదేకదా! ఈ తెమ్మెరకు ఫణిగ్రహ విఘాతమెట్లునుండప్పనిదే! మరియు భీమ వీక్షణాంగారక వైర మీ యంగజున కుండనే. యున్నది. ఇంక భయమేల నమ్మా? నమ్మికమై నెమ్మొగమ్మె నెత్తుము. నీ నెమ్మదింగల కోరిక నెమ్మితో నిమ్మనియు, నేము నీదయకు నిమ్మనియుఁ, గమ్మని వింటిజోదు పాదమ్మె భజింత మిఁకరమ్మా!" అనియోదార్చి యమ్మగువ కరముపట్టియుల్లనఁ దెమల్చెను. ఆపెయుఁ జెలికెదురాడఁజాలక సోలుచుందూలుచు నాతొయ్యలినేన వ్రాలుచుఁ జింతావారిధిం దేలుచుఁ దన్నుఁ గైసేయు సైదోడులం గడకంటి చూపుల జంకించుచు మెల్లన నవ్వెపిన వీథుల నడయాడ వెడలెను.

అపుడా లలనామణులునయ్యుపవనతలమునం గల నానా సూనసంపద లాకలకంఠకలనాదకుం దెలుపుచు నా నెపమునం గాలము గడపువారై "లతాంగి! భవదీయ ఖాతపాద సన్ని

హిత సద్గుణారామసరణి యిదె! కంటివా! కనకగంధములెఱుం గనివాని కీర్తిప్రాప్తియుఁ గాయహీనునకుఁ గరణపటిమయుఁ, బెక్కు-కాలపు మూఁగకు వాక్ప్రౌఢిమయుఁ, బుట్టుగ్రుడ్డకు హితదర్శన ప్రీతియు, జడజాతములకు శాశ్వతబోధసామగ్రియుఁ గల్పించుచు నియ్యది మాధవ నిత్యసన్నిధానముచే నలరారుచుండును సుమా! అలినీలాలక! చూచితివా యీచిలుక ? భవదీయాలాప లీలాప్తింగోరి విపక్వదాడిమ తరుశాఖా ఫలజ్వలనావాఙ్ముఖమై తపము సవరించుచున్నది. అయినను బింబాశి కనూనవాగ్గ్రహణమేధాశక్తి యేలబ్బునులే. ఇటుచూడు ఖు॰ కేతకి ! శివత్యాగాపవాదముం బాపుకొనఁగోరి సముద్ధూళిత ధూళికా భసితయు, బద్ధాళి రుద్రాక్షమాలికయునై యసిపత్రాసికం బూని నిల్చియున్నది. మరునకుఁ బూఁదూపులెన్ని యున్న నేమి? కన్నెగేదంగి విరి కెనయైనదొకటియు లేదుగదా. సూనబాణాభియాతికి దీనిగాలి సోఁకినంజాలుఁ దలయేఱు సోఁకును. ఓకలికి! నీచేపట్టుగల యిది మాకందము. నీవుగనుచున్న యిది సరస తిలకము. నీ యెదఁ జేరునిది తావిగ్రోవి. నీవు పదముంచు నిది యశోకము. నీవు నగుచున్న యది నమేరువు. నీ నిశ్వాసము సోఁకు నిది యింద్రసురసము. నీపలుకులాలించు నిది కర్ణికారము. ఇవి యెల్ల నీకుఁ బరమమిత్రములు సుమా."

అని యావనిత లాజవ్వాని కవ్వానివిభవంబు వర్ణించి చెప్పి చూపుచుఁ గమ్మగాడ్పు లలజడివెట్టకుండుటగు గాలసర్పములఁ జైవభినలతలోఘన దీర్ఘ వేణీభరములు నెమ్మేనులం బెనఁగొన్న

చుండ నొయ్యారంపునడల నవ్వని నల్గడలం గలయఁ ద్రిమ్మరుచుఁ బుష్పాపచయము సలుపుచు నిట్లు సల్లాపము లాడఁదొడఁగిరి.

"ఓబాల! ఈ బాలరసాలము పికపాళిపాలిటి యామర సాలముసుమా! కేలిమైఁ గేలిడి గిల్ల రాగిల్లు నీ ప్రవాళము నించుక గిల్లుము. ఓకొమ్మ! కొమ్మవిదిర్చి ననఁ గైకొనక కొన కేల నిక్కెదవు? రమ్ము రమ్ము రమ్ముమోపిన నీకురవకరాజి రాజిల్లును. నాతి! నాతి చిర ప్రసూత నీయనంటి నంటి కదల్ప నేటికి? ఇంచుక తిలకించు బోటికీ తిలకము వలపులు నించుఁ గదా! ఓమితమధ్య? ఇంచుక పదముంచు మీ యశోకము వాసనలు ముంచును. కాంత! కాంతముఖానురాగముఁ గనక యూకనక యెంతమాత్రముం బూయదుసుమా. ఓవనిత! ఈ వనితరులతల యలుగుల గొప్పునవాడి న్రేగునవాడితిగదే! మనలం గలయ కయ్యాలికచ కేతకికళికకై పఱచెఁ బిలువుఁడా" అని యీవిధమున వనకేళి సలిపి యాలలితాంగులు వనపవనాను షంగమునవాసనలు వోవనట్టియుఁ దేనియలు దొలుకనట్టియుఁ బుష్పొడితూలనట్టియు మదాళిమాలికలు చెనకనట్టియు లతాంతముల నేర్పున నేర్పరించి సేకరించికొనిరి.

కుసుమవాసనలెల్లఁ గొల్లలాడినందుకుఁ బఱచుటామని యెంత పరువులిడునో! చివురు జొంపములెల్లఁ జిదిమివైచినందుకు, బగఱకోయిలయెంత యెగసిపడునో! ఫలపరంపరలెల్లనులిమివైచినందుకుఁ గొదమరాచిలుకలెంతపదఱుకొనునో! కమ్మదేనియలెల్ల గ్రుమ్మరించినందుకుఁ గట్టల్కమై నళు లెంత చుట్టుకొనునో! ఇంక నీగిరిక నిట మసలనీయరాదని తాముగొనిన

కుసుమకిసలయ ఫలప్రసవముల ననమశరున కర్పింతమని యప్పుడంతు లయ్యేడనుండి వెడలిరి.

అట్లు చనుచు మందానిల విజితశ్రమలై యెదుట నొక్క-సరోలలామముం గనుంగొనిరి. కనుంగొని కుఱంగట మెలంగు వనదేవత లాత్మీయ చిత్రపత్రలతాతిలకజాలకాలోకంబు లాలోకింపంగోరి కమలాకరముకురంబు వేమఱు మెఱుంగిడఁ గ్రేవలం దొరలు రాపాడికై వడిం దటకటకరూఢ ప్రౌఢతరతరుపటల పరిపతితపరాగబృందంబు లంగంబుల నెరయ నానందంబునొందుచు నుదంచితరోమాంచకంచుకిత దేహలై యవ్వారారోహలు ముదంబునఁ దదంబుఖేల నాయత్తలైరి. తనయిల్లు తామరతంపమై యింపార సంపన్నలినాక్షి కాఁపుండుచోటు, ముజ్జగంబులం గెల్చి వలరాజు దర్పమేర్పడ నిజాంకశరముల నెలకొల్పిన నెలవు పన్నగ గ్రహణజంబగు గరాగ్ని సంజ్వరము వలిగాలిఁదొలంచు కొన్న తలంబుఁ దమిపెంపుమైఁ దొగకొమ్మ రాజుకరమంటి యెండకన్నెఱుగక ముదముండు సదనము నగు నా కొలంకుసంగ్రుంకులిడి మదనదేవు నారాధించినం గోర్కులు పొదలుఁనని యుప్పొంగుచు నయ్యంగన లంగదములూడ్చి వలిపెంబులుగట్టి శృంగంబులు వట్టి యారాటంబున నీరాట నారంభించిరి.

"ఓ లోలాంబక ! ఓల రోాల" యనుచు నారోలంబాలక లా కేళాకూళిం గేళీలోలలై చాలాకాలం బోలలాడి యెట్టకేలకు గట్టుసేరి కల్పకభూరుహదత్తములగు పుట్టములు గట్టి యలకల తడియార్చి, విరులుదుఱిమి, గందమలంది, యలంకరణము లంకించి యించువిలుకానికైన కానికలం గైకొని

మనోహరమైన యొక్క యారముం జేసికొనిరి. వాసనారం
గములగు నారంగములు సారంగరాగ మంత్రములు పఠింప,
నవనీజతిలకంబులగు తిలకంబులు ప్రసవార్ఘ్యము లొసంగ,
వనై కాంచనములగు కాంచనములు కళికాదీపికల నిలుపఁ, చైత్ర
సహకారములగు సహకారములు తలిరాకుటారతులు దాల్ప,
ద్రాక్షలు ముప్పిరిఁ బెనంగి కప్పికొనిన గొప్ప కప్పురపుటనంటుల
చప్పరముల రాలిన కప్పురముల నుప్పరముతోఁ బెనచుగాడ్పులు
ధూపము లర్పింప నప్పూవుటీరము దేవతాగారమయ్యెను. అందు
గొజ్జంగి మంచున మెదిపి పొదివిన పుప్పొడి తిన్నెలపై లామజ్జక
కాయమానమగు విమానముక్రింద నొక పూసెజ్జ ఘటించి
యామీఁదం గామదేవాకృతి కల్పనముం గావించిరి. ఆతని
వామాంకమున రతి నావహించిరి. ప్రోల నుడురాజును ఋతు
రాజునుఁ గీలుకొలిపిరి. సగంధపవన కోకిలమరాళి కీర సారంగ
ములం గ్రేవల నూలుకొల్పిరి.

ఇట్లు సాంగంబుగ ననంగదేవు నావాహనము గావించి
యనంతర మిట్లారాధించిరి. "హృదయవాస్తవ్యకుటుంబికి నీకిదె
ధ్యానము. జగద్వ్యాపకునకు నీకిదె యావాహనము.
నారాయణ ప్రియసూతికి నీకివె యర్ఘ్యపాద్యములు. అబ్ధి
కన్యాంకశాయికి నీకిదె యభిషేకము. పువ్వుల వింటి దొరకు
నీకివె యలరుదోయిళ్లు. గంధగిరి మరుద్బాంధవునకు నీకిదె
గంధము. అపరిమిత ప్రతాపోష్మసురభికి నీకిదె ధూపము.
తిమిరభయాపహునకు నీకిదె దీపము. మధుపకీరపరిజన పరా
యణునకు నీకిదె మధురసఫలోపహారము. ఓ మానమథన!

మదన ! మధుసఖ ! మనసిజ ! నీ కివే మానమోవాకములు."

అని యక్షకామినులు కోమలకోకూయమాన కోకిలాభాషణేతుల గామనీయకనిధియగునక్కమలాకాముకసుతు నర్చించి వెండియు నిట్లు విన్నవించిరి.

"చేతోభవ ! వాతాందోళితములగు నీ చందనాగురు లతాజాలములు నీరహస్యని కేతనములు. ఈచైత్రుఁడు నీబంటు. అట్టి నీకు నేమీా కాననజాతములగు వస్తునిచయములే కానుక లిచ్చి పూజించుట "శీతాంశోరమృతార్పణ" మ్మనుట వంటిది గదా. మేరుశరాసనమునుఁ బరబ్రహ్మాస్త్రమునుం గలుగు బల్విలుకానిం దృణమగు చాపమునుం గాలికిఁబోవు లేఁదూపులను బూని యెదిరించి చలించి నగమగునట్లు గావించితివి. అగు నగు. సంకల్పసిద్ధులు చేపట్టిన లేఁజిగురుకొమ్మ మేరువు నేని నిరసింపఁ జాలుగదా. విల్లుఁబంగరుకొండఁట. నారి వేదలల కుండలి రాజఁట. అమ్మనంతుఁడట. ఇట్టి సామగ్రి గూర్చి కొని భర్గుఁడు బైటి పల్లియలొండు రెండు దునిమెనఁట. ఆహా ! ఇది నిందు పౌరుషమా ? మఱినీవో ? ఒక్కతుంట విలు దాలిచి యంటినఁగందు తూపులతో నుద్దండత ముజ్జగము లం గెల్చితిగదా. నీ శరము సొచ్చిన ధాతకు, నీ తేజోభరం బాసక కైలాసగుహల దాఁగిన శూలికి, నీ శక్తిహృదయమున నాటిన చక్రికిని రజస్తమస్సాత్త్వికము లెన్నటికిఁ దప్పునవి కావు సుమాఁ!

లోకత్రయీరాజయోత్సేకముఁ దెల్పు నీ పడగనారాయణ ప్రథమమూర్తి. రెండంటఁజేయు నీ కాండచాతురికి నాద్య

నిదర్శనము హామూర్ధజాని. నాళీకసంగ్రస్థుఁడగు వాణీవిలాసి సేఁదును నీఁడాగువాఁడే. మఱి నీయంత ఘనునకుఁ గాంతలన నెంత ? ఓ చక్కనయ్యా ! ఈ యళిచికురఁ బ్రోవవయ్యా ! ఈ పద్మాక్షిఁ గావవయ్యా ! ఈ శుకవాణిఁ గరుణింపవయ్యా ! ఈ పూర్ణచంద్రముఖి నేఁచకయ్యా ! ఈ యబలం గలఁతవెట్టినం గొలఁదా కుఁగదయ్యా!" అని పరిపరి విధములం గొసరిరి.

అంతలో జిలిబిలి కరువలి విసరెను, జలజల నలరులు డొరలెను. కలకలమను శుకపికాళి కలరవ మలరెను. మదన దేవుం డెదుట నిలిచి నట్లఱిముఱిం దోఁచిన నాపడఁతి వడవడ వడంకి దరణిపయి నొఱగుట యెఱింగి యత్తెఱవ లెల్లరు దత్తరంపడి శీతలోపచారము లాయత్త పరచిరి.

మోహోపదేశ తమోముద్రితములగు కన్నుఁదమ్ములందు హిమాంబు లునుచుట ప్రమాదముగదా ! శీర్యదాశావృంత శిథిలితమగు ననులతాంత మసియాడ పీవనలువిసరదగదుగదా! చల్లని పటీరజలముఁ జల్లినచో ననంగకీలాకలాపాలీఢమగు హృదయపాత్రాంతరాళమున మఱంగు స్నేహపూరంబు పొంగి పొరలుం గదా! అని సందేహాందోళితహృదయలై "ఏమందము? మిసేయుదము? ఆని ఏ|మం దని మందలింతము ? ఏమందయాన నడుగుదము?" అని యాలలన లుల్లములం దల్లడిల్లం దొడగిరి.

ఎట్టకేల కెట్టులో యాజవరాలి యడుగులకుం జివురాకు లంటించియు, నూరువు లనంటి పొరలం బొదివియుఁ, జేదోయిం జెందమ్ముల హత్తించియు, బాహువుల మృణాళికలం బెనచియుఁ, జెక్కులఁ జంద్రఖండ మ్ములంధియుఁ గ్రీగన్నులం గలువఱేకులం

గప్పియు నిట్లు నవనవగుణానుబంధ బాంధవములగు చలువలెన్ని
యేనియుం గావించి యచ్చెలువలు "మా నెలంత కీ వసులా
భంబు నించు" మని తమకించి యించువిలుకాని మఱలఁ
బ్రార్థించిరి. ఆవాక్యములలో సుధామయములగు నాత్మేశు
నామాక్షరములు చెవిసోఁక సంజాతచైతన్యయై సుధాంశు సుమ
మాభిషేకమున నున్మీలితయగు నుత్పలవల్లివోలెఁ నా చెల్వ
కనుగల్వలు విప్పెను. అంత సంతుష్టాంతరంగలై యక్కురంగ
నయనలు "బాల! కొందలమేల? మన సపర్యలకు మెచ్చి
యిందిరానందనుం డిందు సన్నిధిచేసె సుమా? సుమనఃప్రసా
దము నందుకొనెంజుమా! శుకోక్తుల సేమముఁ దెలిపెంజుమా!
సమీహితంబందఁగల వింక సందియ మ్మొందకుమా!" యని
యభయముం దెలుపుచుఁ గానన పాళి వెల్వడి బాలికడిమిం
దూలు నాబాలికను గేళీభవనమునకుం దోడి తెచ్చిరి.



ఆ విలాసభవనము పొంత వసుధాపతి వంచనాయతిం బనిచి వెనుకఁ దాను బొంచియుండిన పొదలం గాంచియు సమయానుకూలముగ సమాగమలీలఁ గాంచిన యా నరనాథు చరణాంకసరణి నరసియు, రమణీకృతములగు నుపచారములం గొని తన ప్రియుండున్న సౌవర్ణపీఠిం జూచియు, నాతని ప్రతిబింబభాగ్యములు నోఁచిన చక చకిత మాణిక్యభిత్తికలం దిలకించియు నాహైమగృహవాటికలో నాఁటి వరాలోకకౌతుకము నప్పుడ మఱలఁ గాంచినట్లయి యలసిసొలసి యాసితాపాంగ ప్రవాళశయ్యాతలంబున నంగంబు సేర్చి యంగలార్పం దొడంగె.

అంత లోకబాంధవుఁడు 'నీ యనుజాతను వసుధరానేత యెల్లినేఁటఁ బరిణయమగు. అతని ప్రసాదమున నీజాతికిం బవిభయంబంటదుసుమ్ము' అని యమ్మైంచుమల పట్టికిం దెల్పనేఁగుచున్నాఁడో యన నపరపయోధి చెంతకేఁగెను. కాలవశమునం దన యఖండ చండిమ దూల నస్తాలయవాటికిఁ జనుచున్న యాహేళి యాస్థాళిం దనకరావృత దుర్గముల నిల్పెనా ఘనఁ బఱిణ

తాతపములు గిరికొమ్ముల కెక్కి నిక్కి తన్మూలముల నిరుల వేలము లాక్రమించెను. అపరానుషంగ లబ్ధమగు సంగరాగముతో సక్షిగతుండగు నినుఁగాంచి పద్మిని నెమ్మోము ముడిచెను; ప్రభ యుల్లసిలదయ్యెను; ఛాయయు వెంబడిం జనక మఱలెను. వనజాలయము మూసి యినుజాడనరయు నబ్జినీ రాగలక్ష్మియో, ఘనపదమను నాయసపట్టిపైఁ దమోంజనము పట్టుటకై యపరాశ వెలిగించిన దీపార్చియో, ద్విజసూక్తులచేఁ బతిరాక నెఱింగి నిశాసతి మోమెత్తి దిద్దుకొను కాశ్మీర తిలకమో యన సంధ్యారాగము మెఱసెను. నటదీశాన శిరస్తట త్రుటితరత్నమో యన నభోమణి యంభోధింబడఁగాఁ దద్వేగాభిపాతమునం జిందిన బిందువులో యనం దారక లుప్పరంబునం గుప్పలై యుప్పతిల్లెను. ఆబిందువులు పడుటచే నెగసిన సంధ్యానలధూమకందళములో యనఁగ్రొంజీఁకటు లెల్లెడలం గడలుకొనెను.

అంతనంతఁ జాలితాదిత్య సంధ్యాభిచారహోమ పీతిహోత్ర భవాభీల వృత్రమూర్తి యననిఁ గబళించియు, నభంబు నాక్రమించియుఁ, గమలజాండకటాహమెల్లఁ గడవఁబెరిగెను. తమి సహల్యాజారతా రతాశయుఁడైన జంభారి కీ చీకటియే రత్నజాల మయ్యెను. వల్లవీతతిఁ గూడి మల్లాడు మాయగొల్లని కీయంధకారమే చూడాకలాప మయ్యెను. దారుకావన మానిదారలం గామించిన పశుపతి కీ తిమిరమే గళాభరణ మయ్యెను.– తారాభిసార పరత్వమునం ద్రిమ్మరు తమ్ముల ధాయకీ తమమే యురోముద్రయయ్యెను, ఝషను నోడించి

యుతని సంతతులం బట్టి తెచ్చి తచ్ఛీర్షములపై నంధకారము దన ముద్రలిడి విడిచి పుచ్చెనా యన నగ్రకలిక కజ్జలముతో దీపకళిక లొప్పారెను. హరిపదంబును, హరశిరంబును నగు నభంబున నభోగతులు నించిన ననలో, చరమగిరియను నరంగు శరనిధితీరమునం దరణిని డించిన నతడందు మునింగి యెగఁ జిమ్మిన విమలముక్తాఫలములో యన నవతారకానికరము లాకసమునం దడరెను.

ఇంతలో హరిదంభోరుహాలోచనలు గగనరంగము నానరించిన తమోభరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపఁగా రాత్రియను శైలూషికివరుసగా మౌక్తికపట్టమును, నిటలమును, వక్త్రమును దోఁచెనాయనఁ దూరుపున హరిణాంకాకృతి రేఖైనగమై పూర్ణబింబమై కన్పట్టెను. సంభ్రమంబునం బతిఁ జేర నరుగు గంగాఝరంబుపగిది వెన్నెలలు నిగుడఁగా నిందుండందుఁ గ్రీడించు దేవద్వీపంబును, దారకలెల్ల దన్మథితశుభ్రాబ్జంబులును, దుషారాంబులు దత్క్షీరోదకంబులు నయ్యెను. హరుని తల యెక్కియుఁ, దెలిదమ్ముల నడంగఁ ద్రొక్కియుఁ, గలశవారాశినెమ్మనఁ గలయఁబారియుఁ, గుముదరుచినేలియు, మిత్రాధికారము మీఱరాదని కాకున్న నీ కౌముదీసముదయము రేయెల్లఁ బట్టపగలు గావింపలేదా? ప్రమాకుఁ గ్రింది సోమరులెంతని కాకున్న నీడల రూపుమాపలేదా? బాడబాక్షేప పాపం బేలని కాకున్న నౌర్వాగ్నినైనఁ జల్లార్పలేదా? రాజకాంతాకృతిప్రతిసర్గమని కాకున్న శిలలనెల్ల సరసములు గావింప లేదా?

"అచ్చంపు వెన్నెలలలో నబ్జారి విచ్చేసెను. పచ్చని వింటిజోదును పెచ్చుమీరెను. వలికరువలియుం బలిసివచ్చెను. ఇట్లు ముచ్చిచ్చునుం గూడిన యిచ్చో నిచ్చెలువ యెట్లోర్వఁ గలదు?" అని కళవళింపడు నెలంతలకు మంజువాణి యిట్లనియె. "ఈ రిక్కరాయని కళలు చెక్కుగీటకమున్నే, యీ యెల తుమ్మెదల దిమ్ము తేఁకఁ గ్రమ్మకమున్నే, ఈకలికి కోయిల గళ గ్రహము సేయకమున్నే, యీనిసువు తెమ్మెరదంటు లసువు లంటకమున్నే నేఁబోయి యియ్యచలకన్య యుత్తలముఁ దెలిపి వసురాజు చిత్తమరసి వత్తును. అత్యంత శుభవార్తం దెత్తును. తత్తరం పడక యీబిత్తరిం జిత్తగింపుచుండుఁడా! అని గిరికా గళహారముం గొని మంజువాణి రయమునం బయనమయ్యెను.

ఇంక నిట క్రీడామందిరజాలకముల చక్కని నిక్కి, చంద్రకాంతశిలాకుడ్యముల నీరైజాఱం గూల్చి, కౌముదీ రేఖలు లోఁజొచ్చి వెన్నాడ నోర్వఁజాలక యాగిరికన్య పద్మినీ జాతికిం బీడయగు నయ్యుగ్ర శిఖామణి నాగ్రహమున నిట్లధిక్షేపించెను. "ఓచంద్రా! రాజీవాక్షుల నేఁచు పాతకివి. నీవు రాజవా! నీ రాజత్వమునఁ జక్రములు మనినవా? సత్సంతతులు రంజిల్లి తేజరిల్లినవా? అహిభయోద్రేకము డిందెనా? చెల్లరే? రాజై పుట్టుట రశ్మిమాత్రమునకేనా? రాజౌట దోషాఘమేనా? ఓపాంథలోకాంతక! ఘోరతమమై, ఘనమై, తీరవి కళంకమై వంతలఁబెట్టి నిన్ను పదియాఱుప్రక్కలు చేసితీరుంగాని యింతుల నేఁచు నీ పాతక మింతలనంతలం బోదుసుమా? ఈ పూర్వ పక్షపు గంతులకేమి గాని తుదకు నీ బహుళార్తి ఖేదముల,

జూచెదవుగాక! ఓ కృపీటజన్మ! హాలాహల మయ్యంగజ విరోధి శిరోధిఁ గమలించెఁగాని నీవలెఁ దలకెక్కఁజాలెనా? బాడబం బప్పయోనిధి కాండప్రకాండము గ్రాచెంగాని నీవలెఁ బైకి పొంగింప గల్గెనా! విపినకీలి యా ముకుందు తుండ ప్రఘూణముఁ దూఱెంగాని నీవలె నెడఁదఁగాల్చెనా? సురవ హేతి యాశిలోచ్చయచ్ఛదాహంకృతుల నడచెఁగాని నీవలె సిరుగావించెనా? దయమాలి యాకరణి లోకముల నేర్చు నీకరణిమైన యయ్యత్రినేత్రము ఖరకర నిష్ఠురాలోకముల సైతము పెటిలి పడకునికి యేమిభరము!

విష సహోదరుఁడవై విషరాశి జన్మించితివి. విష భృన్మార్గమున సంచరించితివి. విషధర పరివేష్టితుఁడవై పిన్న నాఁడే విషభుకూచ్ఛాళిక సధిగోహించి విఖ్యాతమగు కౌటిల్యము గాంచితివి. ఓదోషాకరా! మఱి నీకు జీవవిద్వేషము విషమం బెట్లగును? ఓరాత్రించర! కాలనేమి గుణశాలివగు నీ వుదర స్థములగు లోకములకుం గీడొనర్తువనియెఱింగియుఁ గైటభ దానవ భేది నిన్నుం దన యంతరంగమునుండి వెడలనడపెనే కాని యా యిందిరారమణిం జూచి నీగండడగింప లేకపోయెను. ఆహా! రాగనిమగ్నులకు ధర్మము లెక్కడివి? కొండొక సేపు నిన్నిదం గూర్చినంత మాధవునంతవానికి వధూవధా ప్రబల పాతకజాతకళంకము పండెగదా. ఓతోయజవైరీ! నీదుండగ మేమనవచ్చు? శిఖండపీఠిపై నీఖండము బూను శంకరునట్టి వాఁడు సైత మఖండ జగన్మథనుం డగుటలో నాశ్చర్యము లేదు. ఒకవంకఁ దోఁబుట్టువగు శ్రీదేవి లీలావాసము సిరులుహరించియు

నే నబ్జుండను నీవు నబ్జవే యని నాతో మోమోటపు మాట లాడ సిగ్గుగుటలేదా? ఔరా! సహజాధనాపహరణోద్యోగముఁ గళాదుఁడెన్నఁడేని నగ్గించునా?

ఓ నీరజారాతీ! మాయవిధాత తనకొంపఁగూల నిన్నేల సృజించెనో! ఆహా! "పాపీ చిరాయు" వనెడు నుడుగు దప్పగునా? నిగమాతిభూమియు సురపురోగామియు నగు నబ్ధిజాకాయి లేఁడా? హాలాహలాహారియు భవదంశుధారియు నగు ప్రసవాయుధారి లేఁడా? కుశల సంధాతయు భువన నిర్మాతయునగు వాగ్వధూనేత లేఁడా! పరమపవిత్రుఁడు విమల చారిత్రుఁడునగు నళినీ కళత్రుఁడులేఁడా? వీరి నెల్లరం గాదని నీవు తొలుదొల్త కృష్ణవర్త్మకే కళాప్రదానము గావించుట చూడ ననాథయువతిజన దాహమున నీ కతఁడు సహాయుఁడగు ననియకదా!" అని పెక్కుతీరుల నన్నారి యవ్వనజారిం దూఱి వనితాజనతాప వజ్రఘనతా వినుతాంబక ధరుఁడగు మరు నిట్లు పాలంభించెను.

"ఓ వలరాయ! ఆశుగశిఖికీలల నాశుగతి నిగుడ్పవలదు సుమా! నీవేమి చెల్వాలదాయవా? ఆ చెంగల్వాలదాయువలె దయ లవంబును లేని యీ కేవలదారుణవృత్తి నీ కేలనయ్యె? అంబుచరాంక! ఆతఁడు శంబరపోషణశాలి; నీవో శంబరవైరివి. ఆతఁడు మథితాబ్జుండు; నీవో యబ్జాంబకధారివి. ఆతఁడు నిశాటుఁడు; నీవో నిశాటవైరితనయుఁడవు. అట్టి హరిణాంకునితో నీకుం గూటమి తగదుసుమా! అయ్యో! జీవమాత్ర చరితార్థ కుఁడవగు నీయెడ నా దయనీయ వాక్యములు గాలికిం బోయెఁ

గదా. శాంభవ నేత్రాగ్నింగ్రాఁగి పెన్నిద్దుర మేనెఱుంగక యుండు నీకు బ్రొమొక్కలిడి యెన్ని సుద్దులు సెప్పినను మనము చొచ్చునా బోధముపుట్టునా? అంత విరసమగు శరాసనమును, సీధుపారణ మదమున సోలు నారియు, వీతిహోత్రమిత్రంబగు తేరునుంబూని వనాంగణాలుబ్ధమగు ననుచరకోటితో నణుమధ్యా తతిపై దాడివెడలెద విది యేమి ధర్మము? ఏమి గుణము! ఏమి యెక్కుడు? ఏమిబలము!

ఓపాంథమర్దన! అవ్యాజమగు నాగ్రహావేశమును బ్రియోక్తుల సమర్థాధిక్యమును నీకు మధుమత్తభావమునంగదా కలిగెను! కాకున్నచో నియ్యనిలాంకూరము లెక్కి యిట్లాడు టేమి? ఈవన్యాండజశ్రేణిచేతఁ బనుల్గొనఁ జూచు టేమి? ఈ కాయక్రియలు మఱచు టేమి? గ్రాహాసంగ్రస్తసామజ పరిత్రాణము గావించినవాడే. మనుజాసనుం జీరి యనఘనిష్ఠాయుక్తుఁడగు నాత్మభక్తుం గాచినవాడే. పృథ్వీసుపర్వ కుమారుని నిర్గతాసువులఁ బెంచినవాఁడే. ఉగ్రఫాలాగ్నిఁ దూలిన లోకముల నెల్లఁదొల్లింటిలీల నునుచినవాఁడే. అఘటన ఘటనా విశారద హారియగు నా శౌరి యసదృశ చరిత్రుఁడవగు నీవు గిరిశ ఫాలాగ్నిం బడు నెడల పుత్రుడనక కినుక నిందులకేకదా యుపేక్షించెను." అని ననవింటి పెనుదంట నాడరాని గెంటసములాడి యమ్మింటపూరి నెక్కించుకొని వచ్చు మలయనగ భుజగవిమదిగ్ధ దేహుఁడగు గంధవాహుపైఁ జలము ఘోషమిడి యిట్లాడెను.

"ఓ మలయోపవనభవనా! పవనా! నీవు ప్రళయం గువలయంబు విరియును, విష్టపంబు చలించును, భువన భంగ మెసంగును. ఇంక జలదవేణిక లన నెంత? వారిసము మలయ వలదుసుమా? కేలియు నీవుం గూడిన ముల్లోకముల నుడికింతు గనియే కదా నల్మోముల వేలుపు మిమ్ము మూలలం ద్రోచెను. ప్రకంపన! అట్లయ్యును నీవు హవ్యవహుం జేరి జగంబులఁ గాలుపఁ గాలుపదంబుఁ జెందితివిగదా! ఇదుగో! లలనల యుసురువోసికొను నీతఁడనికదా విధాతనిను మెసవఁ గాలాహికి వేయేండ్లాయువు గావించెను. అమితోల్లాసమునఁ బలాశివర్తనుఁడవై బాల్యమాది సుమనస్సంపదఁ గొల్లలాడితివి. అతను విస్ఫూర్తివై నీవు విజృంభించినచో లోకమెల్ల ఘూర్ణింజనుఁగదా! ఓ ప్రభంజన! నిన్ను భంజింప రమాకాంతుండనంతావతారమహాయత్నము గావించినలయుఁ గాని యల్పంబులం దీరదు. నిబిడతమోనుబంధమునఁ దొప్పు మహీజాతమైత్రిచేఁ బ్రబలుచున్న శనైశ్చరుఁడవు నీ వతిపాంసులుఁడవు. ఈర్షుప కేతుసంగతిచే భీకరాకృతివై యబలల జీవనానిలములం గబళము గొందువు గాని బెణకనిత్తువా?" అని యిట్ల వ్యనిత యూనాలి గాలిం గనలున నానాడి తుహినకరకిరణఝరీ కీవాహంబులం దలమున్కలై తల్లడిల్లుచుండెను.

ఆజాబిల్లి వెలుంగువెల్లికల డాయుంజాలక రాకానిశారాజ శ్రీసఖమైన మోమునఁ బట్టఁగా బొత్తి యా రాజీవానన కిన్నరవధూ రాజత్కరాంభోజ కాంభోజీమేళ విపంచికారవసుధాపూరంబు సోరంబుగా నెత్తెత్తి యేడ్చెను. చెలు

లప్పు డమ్ముద్దరాలి నక్కునఁ జేర్చి ముఖాంబుజము నెత్తి కను ఱెప్పల బాష్పములు దుడిచి "తేపే నృపాలుడు గారవింప నొప్పుల కుప్పవై సిరులొందుదుగదా. ఇఁకఁ గుందనేలనమ్మా" యని మనసార నూఱటమాటలాడి 'అయ్యో! మన మంజు వాణియుం జని తడవాయెఁగదా! ఏమిటికిం జాగొనరించెనో? నగేంద్రనందన మదింగల కొందలముం దానెఱుంగనిదా? పగ దాయ వెన్నెల మునుంగు బాలనెత్తి నయముం బ్రియముం బలుక వలంతిగదా. సరే ఏమగునో చూత" మని యాశన్నియు లన్ని దెసలం దిలకింప సాగిరి.

అట్టితఱిఁ బుట్టుంగెంపున నింపారు రవిపెంపు నిరసింపుచు దట్టంపుఁ గెంపుపుట్టంబు రంగు నింగి కాపాదింపుచు సంధ్యా లక్ష్మికిఁ జుంట్టంబో యనందగు నొక్క ప్రభాదట్టంబు కట్టె దురం బుట్టినట్టులయ్యె. అక్కాంత లక్కాంతి పుంజంబుఁ జూచి "తమ్మికంటిపై వైరమూనిన నిశాధవుం దోలవచ్చు లోకబాంధ వుని పోడుపా లేక శుక్తిమతి యీపడఁతి కెత్తంగదెచ్చు, రక్త రాజీవనీరాజనార్చియా లేక నవహజానురక్తిమై నగజాత్మజం గావనే తెంచు నోషధుల చాయయా లేక కూఁతుచంద మరయ నచ్చు కోలాహలుని యరుణకూట దీప్తియా? ఏమిది దివ్య ధామమై తోఁచుచున్న" దని సందేహాందోళితలై యాడుకొను చుండ వసునృపార్పిత నవపద్మరాగ ముద్రాంగుళీయ రంజిత పాణికంజయై యమ్మంజువాణి యటసాక్షాత్కరించెను. ప్రియుం డిచ్చిన యుమ్ముద్రిక సముద్దియమ్మెదుట నుంచి గ్రుచ్చిగ్రుచ్చి

యడుగు పడఁతులకు మంజువాణి తన వృత్తాంతమునాద్యంతము నిట్లు వివరించెను.

“పొలఁతుకలార! అమ్మనుజేంద్రుడు హృదయమెట్టిదో యెఱింగి యీకొమ్మమనమ్మునంగల కోరికలమంతయుఁ దెల్పి రమ్మని పోపొమ్మని మీరట్లనుపం బనిఁబూని కార్యవేగమ్మున నంబరోత్పతన కౌశలమందితిని. అప్పుడీ యిలయెల్ల నగప్రతతి తోఁగూడ నా వెంటనంటి యెగిరినట్లయ్యె. పైపై సమీరారార్భటులచే నింగి బోరున నఱచినట్లయ్యె. కొండలెల్ల నచ్చన గండ్లయి, నిండుచెఱువులెల్ల నద్దంపుబిళ్ళలై, యేఱులెల్ల ముత్తియపుం జేసలై తోఁచెను. పురములు, దుర్గములు, నూళ్లు, పల్లియలు, ధరణిపైఁ గుప్పలుగోసినట్లుగ నేర్పరింప రాకునికిం జేసి కొంతసేపు నిశ్చలాకృతి నిల్చి వసుమతీమహీతలేశ్వరు నగరీ లలామము చాయసం దెలిసికొంటి. అట్లుపోవం బోవఁ బురరమామకుట మాల్యంబులుంబోలె ధర్మహర్మ్య ధ్వజములు తోఁచెను. ఆపై గృహదేవతాపాళికలితాబ్జకళికలుంబోలెఁ గలశతతు లెదురయ్యె. ఆపిమ్మట సిరిలక్ష్మీవాస వనజాతదళములుంబోలె వప్రశిఖలు గోచరించెను. ఆమీఁద జగతీసతీకాంచి హీరపర్వములుంబోలెఁ దోరణములు చూపట్టెను. ఆపిదప శ్రీకాంత యనంతరూపములుబోలె మల్లఖురళి కలయు, నభినయవాటికలయుఁ గరితురంగ శాలికలయు, గంధవిపణికలయు ముంగిళ్ళ నమర్చిన మణి పుత్రికాచయము కానిపించెను. అందు మృగమదఘనసార చందనకాశ్మీర సౌరభ

లహరీ సందోహతుందిలములగు మందానిలకందళములచే సుపశమిత గగనగమనశ్రమునైతిని.

గగనతలగతనగు నా నీడలు దిగువనగపడ బెగడంది యారెకు లార్వ నా యులివున కులికి మూరుటం జేరక పారావతములు తారాపథమునం బాటెను. కేకిరమణీపునహము నిదురం దొటంగి విధూతపక్షమై రొదలొదవింపం దొరకొనెను. అత్తరి నేనొక శిరోగృహపాళికపై వ్రాలితిని. ప్రాకారమే యంత్రపీఠముగాం గవాటికాఘటనమే నేత్రనిమీలనముగాం జంద్రికాజాలమే భూతిపూంతగాం, జంద్రశిలాంబువులే యానందాశ్రువులుగాం బ్రశాంతఘోషమై యాప్రోలు సంపూర్ణ సమాధిమగ్నమైనట్లుండెను. ఆహా! ఆ నగరసౌభాగ్య మేమని చెప్పవచ్చు! భవనములన్నియు హరిహయ సౌధసన్నిభములే. హరితమణి ప్రకరకల్పితములే. హరిపదమార్గ లంఘనములే. అందు నృపపుంగవు మంగళధామ మొద్దియో కదా యని చింతించుచు నెదుట నొక్క సౌధముం గంటిని. పుష్కరధ్వనులతో యక్షాంగనలునుం జటులవాద్యవిచిత్రితోం జారణకన్యలును, మణిదీపమాలికలతోం బన్నగకాంతలును, సుకంఠనినదాతిశయముతో గంధర్వభామినులును నద్దానికిం బ్రహరి దిరుగుచుండిరి. ఈ నరలోకమేమి? ఈసిద్ధసాధ్యగంధర్వ నాగాంగనా సేవనలేమి? ఎంతవింతయని పెల్లుఱ నీక్షించి యా సురరాజపత్త్రమగు చిత్రవిమానము మహిమంబు కాంబోలునని యూహించుకొని యా రాజభవనద్వారము చేరంబోయితిని. పటుసింహగములతోం బాలసున్న మొనర్చియు, శశికాంతములతోం జాదుపూసియుం,

గలికి పచ్చలతో నలికియు, విద్రుమంబులతో వింతజాజు ఘటించియు, ముక్తామణులతో ముగ్గులిడియు, వైడూర్యములతో వన్నెతెర లుంచియుఁ, దేట కెంపులతో దివియలెత్తియుఁ, జకచకిత పుష్యరాగ మాలికలతో వితానములు గట్టియు నా భవనరాజము నవరత్నమయమై యుండెను. అందు పసిండి యోవరులు, దంతపుఁజావడులు, పానీయశాలలు, గరిడీలు, శీతలశిలాతలములు దాఁటిదాఁటి దరావతీర్ణనైతిని. అందలి వివిధ రత్నముల విచిత్రరుచి వైభవములకు వెగడుపడుచు నొకచోట నిదియ కాఁబోలు నృపుని కేళీమందిరమని మాయాబలతిరోహితాంగినై యా ధామముఁ బ్రవేశించితిని.



౨

అందు భామామణులు కొందఱు "ఏమే హేమలతా? ఏమే మాధవీ? ఈ భామామన్మథుని చందమేమో చెప్పలేకున్నామే. ఆరామభూమికిం జన్నది కోలె నేమో నిద్రాహారములే మానినాఁడే!" యనుచు నేకాంతమునం దమలోఁ దామాడుకొన వింటిని. ఆమాటలుకొంత వీనులకు నామెత్తలై ప్రియము, విస్మయము నా మనోభూమిం దళుకొత్తెను. ఇంతలో నెదుటఁ బుప్పొడి పరుపుపై నొత్తిగిలి మోముదమ్మిఁ దలాడపై మోపి, యడుగుజివురుఁ జివురాకు బటువునం జేర్చి చిత్రఫలక మీక్షించు నా సార్వభౌముండు కన్నులంబడియెను. ఆ నృపాలు డెందము శైలకన్యకామనసమగ్నమో కాక ప్రియాంతరాసక్తమో కనుఁగొందముగాకని గంధతైలభాజన గృహదీపికల చాటున నల్లనఁ బొంచియుంటిని. ఆనృపాల పుంగవుండును నసమశరవీర నిశితాశుగదోదూయమానమానసుండై యస్సురుస్సురనుచుఁగన్ను మోడ్చుచుఁ, దలయూఁచుచు నగుచుఁ, జెమర్చుచుఁ, బొరలుచు, లేచుచుఁ, బుష్పాన్పున బ్రాలుచుఁ, బలుభంగుల గలంగుచుండె.

భావగతభావనా సంభావితములగు భావము లిట్లు మల్లడిగొనం దల్లడిల్లుచు భూవల్లభుఁడు చిత్రావేశితయగు వనితంగని మోహావేశమున నిట్లు ప్రలాపింపఁ దొడంగె. "కువలయేక్షణ! ఏమిటి కల్గితివి? పల్కవిదేటికి? ఏల ఠాకటికి డెందముఁ బూనితివి? అళులకు మోముమలంచునట్లు, రాచిలుకకుం బండ్లుదెమల్చుభంగి, రాయంచలు మూగినంజెలులగూడఁ బిల్చుపగిదిఁ జిత్రమందిరమునుండి యేఁగుతఱి నీవు మరలిమరలి నాదెసఁ జూడ నన్నుంద్రిశుద్ధిగ నేలితివని యలరితింగదా. ఇట్లు భావజు కగ్గము సేయుటిది భావ్యమా చెలీ!"

విభుఁడిట్లు పలవరించుట విని సుధాపయోధిం దేలినట్లు బహువాసర పుణ్యఫలంబు కన్నులం గన్నట్లు, త్రిజగంబుల నొక్కట నేలినట్లు డెందమునం బరమానందము నొందితిని. ఆనృపమణి కాంచనమంచసమంచిత యంత్రపుత్రికా మండలిలో నొక్క మణిపుత్రికనై గిరిపుత్రియున్కిం దెలిపి యాతని యాత్మకుం బండువుసేయుదుఁగాకని పకపకనగి యన్నగభేదికిట్లంటిని. "ఓహో వసునృపాల! బాల నేల దూఱెదు? పరతంత్రలగు నింతులు తమంతఁదామె కాంతుల వరింతురా? కన్యలకది నేరమా? అనన్యగతియగు సుదతిని మదనుబారికెరఁజేసి లోఁగనికరింపనివారిదిగదా నేరము! మాయాశీలులుఁ జంచలాత్ములు, స్వాత్మైక కార్యాయత్తులు, సమయానుకూల హృదయవ్యాపారగోపాయనోపాయజ్ఞులుఁగదా మగవారు! అందును మహీపాలురు మహావైభవశ్రీ యోగాంధులుగదా! ఆహా! మగవారిని నమ్మవచ్చునా?"

అప్పుడయ్యంగజనిభాంగుఁ డభంగుర విస్మయాంతరంగుఁడై ప్రియాహృదయాశయబోధానందమునఁ గంటకితాంగుఁడై మదనవనాటఘూటవిపాటితమైన డెందము ఝల్లనం ద్రుళ్ళిపడి లేచి "ఎవరీ పలికినది. చారణకన్యయా? ఖచర సారసగంధియా? కిన్నరాంభోరుహాపాణియా? చిలువపోలంతియా? లేక శైలకన్యకావయస్య యగు నొక మంజువాణియే యాబాలాగళింబెల్ప నీలీల నిచ్చటికేతెంచెనా!" అని యూహించి నదీతనూజ తలఁపు నాయెడ లగ్నంబయ్యెనని వింటిఁగదా. ఇంక నాతాపం బారెనని యూఱడిల్లెను. కాని వెంటనే ప్రియతమామదనార్తి మదిందగులనిట్లు పొగులందొడంగెను. "కటా! ఆమిటారి నాడెంసంబునందుండి కందిపోయెనో? నన్నెడఁదం జేరిచి తా వాడంబారెనో! నేనే తానగుటచే నాచింతాడోలాకలనంబుఁ దానెసఁసెనో! ఎట్లయిన నావలన నామె బడలుపసుచుండెగదా!" అని మఱలఁ జల్పంబునసందొరిగెను.

అదిగాంచి యాన్నృపోత్తము చిత్తము కూర్మికి నివ్వెఱంపడి తాపవారకంబగు గిరికాకంఠహారము నల్లనం గొంపోయి యాతని గళసీమ నలంకరించితిని. అతండును ప్రఫుల్లనేత్రుఁడై "ఏమాశ్చర్యము! ఈ యమూల్యమణిహార మిట్లు రాగతమేమి? ఇది యే నారీమణిహారమో కదా! ఆహా ఇది మైసోకినంతంగాకల తాకువితాకయ్యెగదా! ఓహో! ఈమణిహారము మొన్నెచ్చటనో కన్నట్లు తోఁచెడిని. చూడంజూడ నీవిచిత్రహారంబును నీచిత్రార్పిత కన్యాహారంబు నొకండై తోఁచెడిని, నిజమ్ము, ఈ హార

మానినీహారాహార్య కన్యాహారమే. సందేహము లేదు.” అని యయ్యవనిపతి యాహారము నెదం జేర్చెను. కన్నులనద్దు కొనును. కంఠసీమ నుంచుకొనును. తనువఖిలంబును బులుము కొనును. స్వేదధారా నయననీరంబులగాఢమైత్రిం బ్రకటించును.

రా జరీతిని నుపకంఠాగత నక్షత్రదామముం దన కర యోగంబున గారవించి రాగోపనిబద్ధ మధురస్వరంబున నిట్లు పలుకరించెను. “కమనీయద్యుతిధామమగు నో విమలముక్తా దామమా ! ఆ కమలామోదకు సేమమా ? తత్సఖీ సమితికిఁ గళ్యాణమా ! తన్మరాళమయూరీ శుకశారికలకెల్ల భద్రమా తెలుపుమా ! ఆప్రమదారత్నము పేరుగా నిన్నుఁ బ్రార్థింతును. నిన్నేమని సంభావింతును ! నాభాగ్యాక్షరపంక్తిగా నెంతునా? మూర్ఛాపనోదన దివ్యామృత ధారగా నారాధింతునా ? మత్పుణ్యద్రుమ కోరకావలిగా నవధరింతునా ? ప్రియా పయోధరవిహారమా? ఓముక్తాహారమా? గిరిజావక్షోజగిరి శిఖరనివాసౌన్నత్యముఁ ద్యజించి నామనికిత మాన్ప డిగివచ్చిన నీ గుణంబు లేమనివినుతింతును ? అవును అవదాతసువృత్త మూర్తులగు వారెందును నార్తులఁ బ్రోచుపట్ల నిజసౌఖ్యభంగ ముల గణింపరుగదా ! నెచ్చెలులు మొఱంగి యానాఁడు మణి మందిరమున నాతొయ్యలి భవదాత్మదర్శిత మదాకృతిం గాంచె. చిరసాయుజ్యముచే నాచేడియ యెద నీకువిదితముగదా! దాచక చెప్పుమా? నిన్ను వేడుకొందును. శుక్తిక్రోడగుహానివాసివి, సూచ్యగ్రసంస్థాయివి, ముక్తాహారమవునైకదా యాముగ్ధా హృదయసాన్నిధ్య సౌఖ్యము నందితివి. త్వత్కృపాసంసిద్ధిలేక

ముక్తాహారత నున్నమాత్రనఁ దాదృశ విభూతి లభించునా! పిన్నటనాటనుండియు నాకన్నెకుం గూర్చినదానవు కావుననే నేఁడు తద్వ్యథకు నీవును గుందితివి. మామకశ్రమాంబు సమార్ద్రి క్షమాధరకుమారీ తనూగంధసార సమర్పణంబుల నెన్నండు నిన్నుం దెలివొందఁజేయ నోపుదునో కదా!" అని రాజేంద్రుఁ డా రత్న పుత్రికం గని యిట్లనియె. "ఓ యప్రతిమోపకారసుకృతీ! యీ హారాధిరాజంబుఁ దెచ్చిన దాక్షిణ్యశాలినివి. నీకీ ప్రతిమాపదేశ మింకేల? సన్నిధిం బల్కుమా! వనితావల్లభుల జీవనములు సఖీవాక్యస్రితములు గదా!"

అన విని రఘునందనునిసన్నిధిం బ్రభూత చైతన్యయై నిలిచిన చట్టుపోలంతి కరణిని రత్నంపుబొమ్మగతి మాని ధృతి పూని క్షితిజానికి జోహారుచేసి నిలిచి యిట్లు పలికితిని. "ఓ మహాభాగ! తావక మహామహిమోక్తి దప్పునే? మంజువాణిని నేనచలకన్య బోటినే యగుదు. అక్కన్యయునికిఁ దెలుప వచ్చితిని. అది సరియెకాని మా తెఱవ నిత్తెఱగునం బంచశర శాతశరముల పాలుఁజేసి తిరిగి చూడవైతివి. దొరల కిది తగునా? మఱపుగలిగిన ననదల మఱతురా? అన్నారి నిన్నుం దూఱిన తీరు వినుతునా? నిరంతర మేము తావక శైల భేదన కథా బిరుదాంకములు పేర్కొన వినివిని మెచ్చునూర్చి యవ్వనితా మణి యిట్లను.

"గ్రావములు నిత్యకఠోరము లండ్రుగదా. వానిం బద ఘట్టన నెట్టన గీటడంచినట్టి దిట్టి యింక నేమిటం గరంగు? అన్నుఁగుఁదమ్ముిలఁ బాసి . తన కనుసన్నల కొలంగు నింధిగ్ర

ద్రుణంబుగా నెంచునఁటగదా. కూర్మాసనాభ్యాసకర్మరతయై తన్ను భజించు ధరిత్రిం జులకనగాఁ జూచునఁటగదా! మధురాధర స్పందవిధిఁ దన పశంవదయైన భాష నొండొకమారు వల్కఁడటఁగదా. ఇంకఁ గొఱకోములు నోఁచిన నావంటి జలజముఖుల కూరిములు గణించి యాతఁడేల గారవించును? బహువల్లభా మనోహరుని వరునిగా గోరుముదిత ముదితయా?" యని పాపమా లేమ నెమ్మోము వాంచును.

నావిని యా వసుభూజాని ప్రణయమున నవ్వచనముల నాలించి తదుక్తి కౌశలముం దలంచి మెచ్చుచు నాదరాతిశయ సాంద్రము, సుచిరోత్తరము, ఘనరసభావ బోధకము నగు నట్లుగాఁ గిలికించితంబుతో నిట్లనియెను. "ఏమేమీ? శైలేంద్రములు కఠోరములా? తదీయస్నేయభేది యంతకుఁ గఠోరుఁడా! మంచిది. అట్టిమేటిని ధృతివాపి మూపులనె యూఁటాడించు వారెంతవారో తానెఱుగనిదా? అసలఁ బెట్టియేఁచునని వసువు నిందింపనేల? అశేషజగంబు నివ్వెఱగంద నవ్వసువును వెలఁ గొన్న మోహసంవాసపదం బుదారమణి యాశుక్తిమతిం జనించెగదా. శ్రీవాణీధరణీప్రముఖులగు నంగనలపైఁ జిత్తము లేమిని వేమారు వచింపనేమున్నదిలే. నిత్యగుణలక్ష్మియు, సంతతా వక్రవృత్త్యావిర్భావయు, నఖండరూపయునగు కన్యం గోరువాఁడు సిరిపెంపును, వాగ్విలసనమును, మహీభోగమును నేలగణించును!"

భూధవు మధురవచోధోరణిఁ జెవులార నవధరించి "దేవ! నీవు చతురాస్యుండవు, నీకు వచనప్రౌఢి యరుదా? తెలివయు నీవియోగవృత్తి కోర్వఁజాలదు. ఏఁచెదవో? వెసం బ్రోచెదవో నీయుల్లముం దెలుపుము!" నాపుడు భూవరుం డిట్లనియె. పురంధ్రీమణి! నామదిం బాయని సారతరానురాగ చింతామయ దామయంత్రపరిణాహమును, దాహమును మోహమును నీవ చూచితివిగదా. మఱి వినుము. ఆనగేంద్ర నందన గురుజనాధీనగాన మనసుగానక సందియమున నిన్నాళ్ళీ ఖేదజలధి నీఁద నిప్పటికిఁ దెప్ప గలిగెనుసుమా. నేఁటి మును మాపున మహేంద్రభుజిష్య యొర్తు వచ్చి యయ్యింద్రుండు మదాశయ మాత్మ నెఱింగి పాణిగ్రహశుభం బొడఁగూర్పఁదానై నగేంద్రుం గన్నియ వేఁడవచ్చునని వాక్రుచ్చెను. చల్లని తియ్యని యావాచావిభవంబు విన్నవాఁడనయినుమీ వాచాల మదనగుణ నారాచార్భటి కోర్చియుంటిని. ఇప్పుడపోయి యీ శుభవార్త మీచెలికిఁ జెప్పి కామాశుగపీడితములగు ప్రాణము లూఱడిల్లఁ జేయుము." ఇట్లనుచు నుర్వీశుం డీ మహితాం గుళీయకమునాకొసంగి వీడ్కొలిపెను. నేనును క్షణమాత్రం బున నిట వచ్చి వ్రాలితిని."

ఈగతిం దన కతయంతయుఁ దెల్పి మంజువాణి భూర మణు నంగుళీయకంబు నొసంగుటయు రవితేజంబగు సద్దాని నన్నవలా సవిలాసముగఁ గైకొని యేకతంబునం గైశ్యపరోహాద పద్ధతిం దసరంజేయును; నేత్రనలినంబుల నొత్తుకొనును;

మఱియునురోజరథాంగములఘటించును. ముద్రికపైఁబతినామా క్షరములఁ దిలకించినంతన నాలలన కొయిలాపతిం గన్నులఁ గన్నట్లు నునుసిగ్గు ముంచుకొనివచ్చె. ఆపై నాపైదలి దానిని ప్రేలం దాలిచి నంత నవ్వసుపతికరగ్రహణ మప్పుడ చొప్పడి నట్లు కాంతివిభ్రమ వైభవోన్నతులు గాంచెను.

గిరిక నరపాలుపైఁ జూపుఁబరపినంతన వలపు నెఱపు టయు నన్నరపతియుఁ గనికరమునం గరాంగుళీయకముం గుఱు తుగా నంపుటయు సురపతి గిరికాపరిణయ ఘటనాదరమున ధరణీధర వరుఁ దరియునరుదెంచుటయు న త్తరుణి పరిచారికల వలన నెఱిఁగి శు క్తిమతి మహోత్సంగ గరిమం బొంగిపోయెను; కోలాహలుండు నుత్సాహదోహలుండై మిన్నందెను.

అప్పుడయ్యరవిందగంధి హృదయాంబుజంబు ఖేదంబు నడఁపవచ్చి శోరపురుచిమై వెలుంగు వసురాజు కరోద్మికం గాంచి యింక నాచపలలోచనం బొదువఁ గొలందిగాదని భీతిల్లి తారకభటాళితో నిశాధిపుని బలంబు లేఁగుచున్న వా యనఁ జంద్రికాపూరంబు రహిఁదొఱంగెను. ఇంద్రునంతవాఁ డొకకాలమున మదీయ కంఠో క్తి నాలంబించి యొకానొక ముని శాపో క్తికిఁ బాలుపడె కాని మునిత్రయ సంభావ్యమును గాలత్రయ విబోధకమునగు నాశబ్దం బల్పంబుగాదు సుఁడీ యనునట్లు తామ్ర చూడంబులు టెక్కలల్లార్చి కంఠంబులు నిక్కించి త్రిభంగిగా ఘోషించెను. ఆతఱి నొక కాతరనేత్ర ప్రాభాతిక శోభాతిశయ వికసితకుశేశయ నూతన మధు మధురతా మనోహరఫణితి నక్కలికి కిట్లుపలికెను.

"ఓ చెలీ! అమృతాంశుఁడు నిశాసతిం గలిసి శీర్య
చ్చంద్రికా గంధశిల్పముతోఁ బుష్కరశయ్య వీడిచనఁగా
దత్కాలసంభ్రమ సంశీర్ణ తారహార మణివారమును వేళా
దూతిక యేరి యొకచోఁ బ్రోగువెట్టినదో యన వెలుఁగు వేగు
జుక్కం గంటివా? గగనకేదారమునఁ జంద్రికానీరం బాఁతినం
జూచి పండిన తారాసస్యముం గోసి ప్రాతస్సీరిగ్రామణి తద్రుచి
ఫలానీకముం దూరుపెత్తెనో యనం దూర్పునం దెప్పయ్యెను.
దూరన్యస్థమగు తత్పలాలరాశి యో యననిస్సారుఁడై యిందుండు
కడకుఁ దొలంగెను. శ్రీదేవి నూతన పంకేరుహ గృహప్రవేశము
గావింప నేతేర ద్విజారావ మాధురిం బుణ్యాహవాచనంబు
సలిపి గురుతరులు చలత్పల్లవోదర నీహారజలంబులం జిలుక
రించుచుండ ద్విజాతియగు రథాంగము తానొంటిమై నుంట
తగదని కవఁగూడి యడరెను. బోధగుణశాలియగు సమయ
మహర్షి మహోదయ భూమిభృద్వతంసమునకు బ్రాగ్వ
ధూటికిం జక్రహితుఁడు నశేషదేవతాంశుఁడు నగు సూనుం
డుదయింపవలెనని తారచరుభక్త శతాహుతి పూర్వకముగా
సాంధ్య మహోమయ హోమవహ్నిం దీప్తము గావించెను.
కుముదాధార విహారములు కన్గొనజాలక కమల యంభోజ
గేహముమూయఁగా, నిదె వేగందెఱపింతునని సమయోపేం
ద్రుఁడు వామాలోకముం గప్పి సంజాతరాగానుబంధముతో
దక్షిణాలోకము న్మొఱయించెనో యన విధుండు గ్రుంకెం
బ్రొద్దువొడిచె.

ఓ చామీకరచారుగాత్రి! గోత్రోత్తంసమును వేఁడి నేఁడు నిన్నా చేదిక్షితిపాలశేఖరునితో హత్తింప నేతెంచు ప్రాచీభర్తకుం బట్టు పట్టుగొడుగై భానుండు భాసించుచుండెఁ దత్ప్రాంతంబులం బ్రభావీచులు రత్నగుచ్ఛములై యొప్పుచున్నవి కన్నులు దెరచి చూడుము." అని విన్నవింప నా ప్రసన్ననలినానన క్రొన్ననపానుపు డిగ్గి దినాననకృత్యము లొనరించి గురుని భజించి ప్రీతిమైఁ బ్రతీక్షించియుండెను.



స్త్రోలుతఁ బారిజాత లతాంతమాలికాపవనము ఘుమ్మునఁ బరిమళించెను. ఆవెనుక నభ్రగర్జార్భటిం దేవదుందుభులు గుభుల్లుభులనియెను. ఆపిదప నఖండమై దండిమై నొక దివ్య తేజము ధగద్ధగ వెలింగెను. అంతలోఁ గొంతసేపునకుఁ జదల నిది విమానపంక్తి, వీరు దిక్పాలుగు, వీరు మునులు, వీరు లేఖ భామినులు నని యవనిఁగలజనుల కద్భుతముగాఁ గనవయ్యెను. హరిప్రముఖ హరిదీశులును, హరిహయకరిహరి హరిణాక్షీ హరి ముఖముఖులుం దోఁప నంబరము చిత్రాకృతి నందగించెను.

ప్రబలాకారమున గిరీశు శిరమెక్కి పెనుతాఁగయను జనాపవాదముం గంటిఁగదా నాకిది యేలయని యబలాకార మున నవ్విబుధేంద్రాపగ పద్మపాద పదవీ విన్యస్తభృంగాక్షియై చయ్యన గిరిశావాప్తికై యేతెంచెను.

అంతలో నగ్ధపులాయితముగ జోడనం జూపునోజ జేజే రాచతేజి పుడమిడిగె. మొనవ్రేలం దలవంచుకొన్న వన్నియ

మీఱి వేల్పుకన్నియలుం డిగిరి. కరఘాత పతదంబుదఘటలం గొమ్మున౯ జిమ్ముతమిం దోనెడఁగ్గి చౌదంతి దిగెను. లేచ కాభ్యాస సూచకంబగు నాత్మచాతురితో బాసవాల్దొరలుం దిగిరి. ఉద్గ్రీవులై భువివారలెల్లరుం జూడ నావెంబడి దివ్య విమానరథకదంబముం డిగియెను. కోలాహలుండును దేవభటాళిభటాళిని, చౌదంతికి దంతిని౯, దేజికిం దేజిని మణిబింబ దంభమున౯ బ్రతిసూపెనే కాని పైవచ్చువజ్రికి దానేమాత్రము నల్కఁడయ్యెను. వసుధాత్రీభృన్నఖాగ్రంబు వ్రేతకు బిట్టోర్చిన గట్టుఱేడ దంభోళిభృత్కేళికి వెఱచునా ?

ఇంద్ర శుభకార్య సమాగతికిచ్చమెచ్చి యన్నగేంద్రుఁడు తత్సముచిత చాపోపధాధరుఁడై యెదురేగుచున్నాఁడా యనునట్లుగా నమరసమాగమావిలములగు మృగౌఘవిలంఘనముల దీర్ణములగు ధాతుచూర్ణములు బహువర్ణరత్న శిఖరద్యుతులతో నభ్రవీథిం గమిచెను. ప్రబల జలపాతములు పాద్యములుగా, మందారతరుప్రసూనఘటనమే యర్ఘ్యవిధానముగా నతదివ్యోపల కూటదర్శనమే నానారత్నపూజావిధిగా నన్నగేంద్రుం డింద్రునకత్యున్నతి న్నతులు గావించెను. వెండియు గిరీంద్రుండు వేఁడివేల్పు మున్నుగా వేల్పుల వేఁడి, మునుల కెరఁగి, గంగ నలరించి, క్రమంబున౯ గ్రతుభుగంగనల మృదూక్తుల నాదరించి, "ఈలతాంగి నా కులదైవతము. లలనాకుల భూషణము. మేనా కులభూధరేశ్వరుల యనాకుల భాగ్యరాశి. మైనాకుల ముద్దుకూతురు. పినాకుల మేనగోడలు సుఁడీ" యని కన్నియఁ దెల్పి నానాకుల పాలికలుం గొలువ నాకుల ప్రొమొక్కని యోగించెను.

గురు వసుమతిం దమ కవనతిఁ గావించి నిలిచిన శైలజం గాంచి సురల యనిమిషతయు సురేంద్రు బహులోచనతయుఁ గృతార్థములయ్యెను. అన్నగజఁ గన్నంతరంభ కేవలజడస్థితిం దలయెత్తదయ్యె. హరిణి జళుకుచూపులం జూడసాఁగె. కుందనం గంది శశిరేఖ కొందఁజెందె. పలపలనై తార వెల్లబారె. మదాలస యుచితకార్యవివేక ముడిగె. మంజుఘోష యుద్ధతభాష మానె. వరూథిని మరువక మైమరువునుపూనె. చిత్రరేఖ చెయ్యోలుడిగె. సానుమతి ఊపడియె. హేమ సాంద్రతాప మునఁ గరంగె. నిర్జర లతాంగులెల్ల తన్నుగాంచి సిగ్గుపా టినయ వినయ వినమితాననయై యున్న యన్నగరాజతనయఁ జేరి యాశావహాళి మణిమండనయై శుచివృత్తియై జల్లగామన్న వియన్నదీలలామ గరిమమై సన్ననబోణిం గౌఁగిలించి "ఓయన్ను వపట్టి! నిన్నుం గనిన యన్ను వసుంధరంగల సింధుజాతిలో పన్నియకెక్కెను. నీవు గలిగినకతన నీ తండ్రియు నియతోన్నతిం గాంచెను. ఓగిరికన్యా! చరణాగ్రానమితాచలేశ్వరుఁడు, సన్మార్గసంచారి, స్థిరకళ్యాణ సమాఖ్యుఁడు నగుపతిని హరికృపచే శీఘ్రముచేపట్టి యరలేక నీవు నతఁడు నేకీభావంబొంది యాగిరికన్య కన్న ధన్యవయి యక్షీణానుమోదముం బెందుదుగాక" అని యాశీర్వదించెను.

ఇట్లన్నది పలికినది విని వినయత హృదయుఁడై వినయమునం బునఃపున రవనతి సలిపి కృతాంజలియై సురేంద్రునకు ధరేంద్రుఁ డిట్లనియె. "దేవా! భక్తపుంజప్రియా! నీకు వాహనమా ఘనము? ఆకల్పహా పదాన్యమణి! వసమా కల్పాగము

దోడ్డిపశియా వేల్పుగడ్డ! అట్టినీ కేమి పాదార్ఘ్యమిత్తును! ఏమి
రత్నాంజలి యిత్తును? అలరుటెత్తులు దివ్యసద్వస్తు లేమి
త్తును? నీ వేమిట మెత్తువు? మహనీయ యోగసన్నహసాధ
కుఁడవై పుణ్యాపగాంబు గాహముం గనుటయు వసురాజాఖర్వ
తీవ్రపాదసహుండవై గాఢతాపాగ్నిఁ గ్రాఁగుటయు, బహుదూర
గత భూరిపక్షగౌరవుండవై పరమనిశ్చలవృత్తిం బాదుకొని
యుంటయు, ననవాప్తగురు బాంధవ నిబంధనుఁడవై గిరికానన
రక్షైకపరత నుంటయు నిదియేమదీయాపదానము. దీనినే కృపమై
నపార తపో రచనముగాఁదలచి నన్నుఁ గావవచ్చితివా దేవా?
ఆహా! వెంగలికి వేల్పుదోడనుట నిక్కమయ్యె. చేదిరాజపాద
నఖహేతిహతి నిట్లుగతిదూలియున్న యీపిచ్చుకగుంటపై దయ
పెంపున నమరలోక వాహినిం దెచ్చితివిగదా! ఓనగారి!
భవత్ప్రసన్నతచే నిజ్జగతిం గృతినైతి. అహీనమహీధరజాతిలో
మదీయగౌరవము హెచ్చె."

అనుటయు నింద్రుండిట్లను. "అచలేంద్రా! లాతిరీతి
నిట్లాడనేల? అధ్వరభాగభోక్తయు, ననిమేషశ్రేణిలోఁ బెద్ద
యుంగదా నీ తండ్రి. మేనాశుక్తిముక్తామణీ! తత్తయుండవైన
నీకు గోత్రాధరేంద్రాభినంద్య నితాంతోన్నతకీర్తి గౌరవ
మరుదా! చేదిమేదినీపతి పాదకంజకృత ఖంజభావముం జెందిన
నీ ఖేదాపనయమునకే జనియించిన దీతనయ. మామక నియో
గాయత్తచిత్తుండవై లక్ష్మింగన్న దుగ్ధాబ్ధి కైవడి, దాక్షా
యణింగన్న పెన్నగము చందమున నర్హాధినాధాప్పణాహ్లాదము
నందరాదా! అగతనయుండవగు నోయగతనయ! నిగనిగని

మెఱుఁగుం దెగడు నీ కన్నియకు మత్ప్రాణ సఖుఁడును, గుణ గరిమగనియు నగు మగనిం దగునతని వినిపింతు వినుము.

చరణాగ్రానమితాచలేంద్రుఁడును, సదాసన్మార్గ సంచారియు, స్థిరకళ్యాణ సమాఖ్యుండునగు నా వసుధరాధీశుఁడు కలఁడుగదా! ఈ గంగావచనం బథార్థం బెట్లగు! గోత్ర శేఖర! కళ్యాణి నిక్కన్ని నన్నురనాథాగ్రణిరాణిఁ జేయుము. లోకత్రయ్యభినందనీయ విమలాలోకుఁడును, సుశ్లోకుఁడును, నాలోకాలోక ధరాధురీణుఁడునగు నాతం డల్లుఁడయ్యెడి నన్న నీ తపః పరిపాకం బెట్టిదో కదా! నాఁడు పాదనిహతిం బైకొన్నవాఁడే నేఁడంఘ్రినాళీకద్వంద్వ నతుండగు కల్మియుం బల్మియు నీకుం గల్గెసుమా."

ఆ పల్కులు విని హర్షకలనా వలమాన మానసుండై యచలాగ్రణి యాఁబలవైరికి వలచునట్టి"ఓ యనంతరకృపారసవాసవాసవా! మామకశోకవార్ధి కీలతాంగి నావ. అబ్ధిరశనావలయేశ్వరు కేలఁగీలించి నావలవంత దీర్చెదవే! ఒక వేల్పు ప్రత్యక్షమైనంజాలు సిరులు దొరలునండ్రు. ఇందరు వేల్పుదొరలు గొలువ నీవ ప్రత్యక్షమై కృపనింపఁ దలంపులెల్ల ఫలింపవా? నిలింపరమణా! సతినడిగించువాడు భవ్యగుణశాలి వసుండఁట. అడుగవచ్చువాఁడు దివ్యరాజ్య భరణైక ధురంధరుండగు పురందరుండఁట. కన్నియనిచ్చుట సర్వదేవతాహితమఁట. తొయ్యలిం గనినవారి కింతకన్న శుభం బెయ్యది? ఇమ్మని వేఁడ నే వేఁడుకొఁడనా? నీవాఁడన కదా! దేవ! నాసొమ్మననేది? అఖిలమ్ము నీయదియ కదా. అదూరమున నే యున్న శుక్తిమతిని రప్పించి

తదాప్తబంధుజాతమును మదీయాప్తులను బిలిచి కన్నియను నీ మిత్రున కిచ్చుకొమ్ము” అని విన్నవించెను.

ఆ తఱిఁ దాతపాదపార్శ్వగతయై తగు నాలతకూన నతాననయయి కేలిఁ గేలినళినంబు మొనలు నఖరాంచలములఁ జిదుమం దొడంగుట చూడ వజ్రధరదోరశని ప్రతిమానమీన కేతన విశిఖము లిఁకమీఁద దనకు నఖసాధ్యములని గణించు చున్నదా యనునట్లుండెను.

అంతకు మున్నె తనచెంతకు వచ్చు నెచ్చెలులచే నగవైరివాక్యము వినిపుణ్యమహాతరంగిణీ కాంతలుఁ దానుశక్తి మతి దేవేంద్రుం గొల్వనేతెంచెను. అమృతమూర్తివహించు హరజటాసంభవ గంగయు, సుమనోమణులఁ బ్రోచు సోమకన్య నర్మదయు, ధరనుద్ధరించు భూదారరాజ తనూజ వారాహియుఁ దఘమెల్ల వారించు తపనపుత్రియమునయుఁ గాలవైషమ్యము గడపు రుద్రాంఘ్రిజయుఁ, జలువలు వెదఁజల్లు మలయదుహిత తామ్రపర్ణియు, నభవసాధన రత్నమగు పినాకోత్పన్న పినాకినియు, నార్యాప్తి నెసఁగు శీతాద్రిజాతయు, మఱియుంగల పుణ్యనిమ్నగలును మరుదీశని దేశాపదేశమున నాత్మీయ మహిమలు మెఱయ నిజాప్త శక్తిమతీ తనయా వివాహమహమునకు విచ్చేసిరి.

ఎవని గర్భమునఁబుట్టి యజ్ఞాతగోత్రయగు ననాదిశక్తి సుగోత్రభవ యయ్యెనో, యెవని పాదతీర్థ మౌదల ధరించి యాదిభిక్షుఁడు దుర్గాధవుఁడయ్యెనో, యెవని దిక్కుఁ జేరి మితతేజుఁడగు జగన్మిత్రుఁ డుత్కటవసుస్థితి నొందెనో, యెవని

శేషంబున కిచ్చగించి కులమువా రభిమాన గోరత్నములు గాంచిరో యెవఁడు తనకొక మఖాంశ మొసంగిన యనిమిషులకు నిరంతరయాగభాగభోజనము లొసంగి యవర్ణ్యైకగురుం డని పించుకొనెనో యట్టి మేనాకుటుంబి రాక నాకుల కానందకారక మయ్యెను. ఆ నడఁకువెట్టదొరకుఁ గరావలంబమై భవ్యగుణ మంజిమ నమరాలి మానసము నలరించిన మనుమరాలి వివాహ సంభ్రమముఁజూడ మేనయు వచ్చెను.

పిడుగుకైదువు పెట్టు మాన్పుకొనఁ బయోనిధి మహా పధిరసముఁ జమరినట్లు, కడలికరళ్ళరాయిడిఁ గీడ్పడి తటాంత వనరాజి మైనంటవ్రాలినట్లు, మున్నీటి పెన్నీటి ముదురుచిల్వాల యలజడికిఁ బచ్చలజోడు దొడిగినట్లు, నిరంతర జలాంతరాళ సంస్థితిచేఁ బ్రాఁచివట్టిన మేనితో వాసవాధివాహితయగు నిజా నుజభవా వివాహమును దిలకింప వలిగట్టు తొలివట్టియుబయలు మెఱసి వచ్చెను.

ఇరువ్వురును దేవసంభరణులే. ఇరువురును నబ్ధధరోన్నమత్కా రాంతర మహనీయులే. ఇరువురు ననంతగుణాఢ్యులే. కావునఁ బరస్పర సమతాసమగ్రమగు సఖ్యముతోఁ గవఁగూడి మేరు మందర ధరణీధరేంద్రులుం దత్క్షణమ వచ్చిరి. మఱియుఖ్యాతిం గల్గు నగసామ్రాజ్యధొరేయులందఱువచ్చిరి. కాని తద్భూరి భారాప్తిచేఁ గ్రుంగు ధరిత్రిం దామ్యత్ఫణారాజిపై మాటి మాటికిం గుదురుపఱచుకొనుచుండెనే కాని యవ్వనుకళ్యాణము నీక్షింప శేషుఁడు రాఁజాలకపోయెను. శేషవృత్తికి విస్రంభ

సంచారములు తగవుగదా. ఇట్లు వచ్చిన సింధుకాంతలం
గరుణారసాభివృద్ధిచేఁ హెచ్చఁజేసియు గోత్రశిఖరీంద్రుల నున్న
తిన్మై గౌరవించియు నావైయచ్చరలోకభర్త హిమాలయ
నూతిక్కై యటనొక్క మహానగరమును సంకల్పించెను.

నిమ్నప్రపాతాంచల నిర్ఝరములతోఁ గటకపరిధికోటద్యై
కనుపట్టెను. మణిచిత్రకిరణ తోరణమాలికలతో గవ్వారములు
గృహములై ప్రకాశించెను శుచికరోపలభంగ సోపానసరణితో
శిఖరపాళి సౌధాళియై చెలఁగెను. ఘనసార వనుసార గంధ
సారములతోఁ దటాజిరము లంగడులై యలరెను. కల మధుర
కోకిలాలాపకలనతోఁ జిన్నిలతలు కొన్ని కన్నెలై చెన్నలరెను.
సమధికస్కంధశాఖా భుజములతోఁ దరువులెల్లఁ దరుణాగ్ర
గణ్యులైతనరెను. పృథుగండములెల్ల భద్రశుండాలంబులును,
గురంగములెల్లఁ దురంగములును, శరదములెల్ల సరదములును,
కేసరులెల్ల నృకేసరులు నైయొప్పెను. విపులవప్రములు,
విప్రవాసవాటములు, కళ్యాణకూటములు భూదారవర్గములు,
కంచుకిఖడ్గిహారిరాజతతులు, యూథాధిపతులు, శ్యామాసమా
జములు, సామోదవిటప ప్రకాండములు, సరసుల తండములు
నెల్లనగములం గల్గుఁగాక. కాని యివియెల్ల నిజనామగరిమ
వదల కచట నుచితార్థగతిఁ బూనుటచే నమరేంద్రుని కృప
నవ్వనం బొక మహాపట్టణం బయ్యెను.

ఒకవంకఁ బద్మినీనవపాత్ర పాలికానీతగంధరజము తావు
లీనుచుండ, నొకచాయ వరవర్ణినీవర్గ కల్పితాంగరాగ విశే
షము గడలుకొనుచుండ, నొకదెస రంభోరుకాండోత్కరపుహో

ముఖ న్యస్తఫలజాతము పరిఢవిల్లుచుండ, నోకపాంతఁ బూగి సుకంధరా పుంఖితక్రముక తాంబూలీదళము లెసగుచుండ మిత్రకాంతాభిలక్షి తారాత్రికములును, శ్రుతిహితద్విజకామినీ సుస్వరములును, మృగవిశాలేక్షణాదత్త మృగమదములును బలిసి యానగరమున శుభార్థవైభముం దెలిపెను. దానిం గనుంగొని యాకన్నె నెచ్చెలులగు వనదేవత లావసువాసవుల ప్రబలసఖ్యమును, స్వీయమనోరథద్రుమ నూతన ఫలపాక రేఖయు నెన్నుకొనుచుఁ బుణ్యావాహినీ వనితలంగూడి సాహుయ్యకవైభవ ముల సమకూర్పం దొరకొనిరి.

అంత నింద్రుఁడు వాచస్పతిం జూచి "మీరే యీ కేయొక శుభలగ్నము నియమించి యివ్వధూవరులకుం గుశలం బీరే" యనుటయు దేవగురుం డిట్లనియె. "దేవేంద్ర! సూర్యా దిగ్రహతారకావిధులతో నీవిట్టి సత్కార్యంబు నిర్వహింప సమకట్టుటయుఁ శోభనముహూర్తముల ధ్యానింపఁదగిన పుణ్యా పగాహార్యస్వాములు పెండ్లిపెద్దలయి వచ్చుటయుఁ గలుగ నింక మదాచరితమగు నాచార్యక మార్యస్తుత్యమై వధూవరుల కఖిలైశ్వర్యముల నొసంగుటరుదా! మఱియు నళిఘట మీన కేసరి శరాసనగో మకరంబులఁ దన కచకుచనేత్రమధ్యములను భ్రూకటిజంఘికలను జయించి నిస్తులతమై నజాంగనాధిక యశో నిధియై యవక్రవృత్తియగు నిక్కాలికికి మిథునకల్పన యోగ్య ముగా నున్నయది." ఆచార్యోదితమగు శుభలగ్నము నహార్య స్వామికిం దెల్పి యాప్రాచీదిగీశుఁడు చేదీశునకు నద్దాని నెఱి గింప నరిగెను.

నిండు మనమునం దన మనీషితమెల్ల ఘటింపవచ్చు నాఖండలు రాక చారణముఖంబున మున్నె యెఱింగి చేదిభూమండలనాథు డతిమాత్రముదముఁ గాంచెను. కొండలం బిండిసేయు శతకోటి సమేతుండగు. హితుఁడు గల్గినవారి కింపుం జిత్రమేమున్నది? రత్నకూట విహారమే కాని యెన్నఁడును కుస్పర్శ యెఱుంగని యయ్యింద్రు పదములను వసురాజు తనమౌళిరత్న కూటాగ్రసరణిం గూర్చెను. అడుగులంబడిన యాతనిం “బెండిలి కొడుకవుగ” మ్మని యలమికొని యావ్రజి ముదంబడర నొడలెల్లం గన్నులు గడలుకొనఁ జూచి యవనికాంతున కిట్లనియె. “నిన్నటిమాపు మాపురమున మణీరమణీయమగు సభావిభాగమునందున్నతరత్నపీఠినుండివినోదించుతఱి నీనడుమ మన్మిత్రుండు రామికిం గతంబేమాయని నిన్నుం దలంచితిని. తలంచినంత భవదీయమానసతలచింత యెఱుఁగనయ్యె. అంత నాచెలి యామని చెలికిం గలువల చెలికి నెంత దలంకెనో యని కంటికి నిదుర రాదయ్యె. దానంజేసి యంబక పంచకంబుగల శంబరవైరి సహా

త్ర్యంబక బాంధవుం బెనకియాడు నంతటివాఁ డాయెనా యని భవదంగభవతాప నివారణతత్పరుండ నైతిని. ఈ ప్రొద్దుననే వచ్చి శీతనగపుత్రునిఁ గన్నియనీవేఁడి నేఁడే సుముహూర్తము నిశ్చయించి నిన్నుం బెండ్లికొడుకుఁ గావింపవచ్చితిని."

ముఖానతి నమ్మహేంద్రు నానతింగ్రహించు నమ్మహీమహేంద్రుమనము నెఱింగి మంత్రిపురోహిత దండనాథులాక్షణంబ యమ్మహానగరముం గయిసేయఁబంచిరి. చంద్రసూర్యాకల్పశతముతో బహుసంఖ్యలకొలది మేరువులు పన్నిరి. అధికాయమాన రంభాళితో హరిచందననగంబు లెన్నేని నాటిరి. వజ్రకూటప్రవాహములతో నింద్రరత్నవితానములు పెక్కుసవరించిరి. అతుల హేమాకృతిప్రతిమలతోఁ జిత్రరేఖలచాలు మిఱిమీఱి నిలిపిరి. అనంతకుముదసంతతులతోఁ దగునెడల నగణిత పుండరీక వ్రజంబు గట్టిరి. వాసవపురివారు చోద్యమంద నిట్లు వాసవపురంబు సమలంకృతంబయ్యె. కాంచన పత్రికల శుభ సూచక వాచకములు వ్రాయించి సమస్తదేశాధీశులకు బంచిన వారవ్వాని పూలిసంధించి నేఁడుగదా మనకు సువర్ణపట్టభృతి యబ్బెనని హాటకపుష్ప ఫలోపహారములం గొని యేతెంచిరి. గాయక గాంధర్వ గమక రేఖ వైణికవల్లికాశ్రేణి నిమ్నలమీఱెను. వాంశికవంశికా వైభవం బాగాంధర్వ గమక రేఖను బరాహతము చేసెను. తాళికాధర తాళగరిమ మూ వాంశికవంశికా వైభవం బెగనూఁదెను. ఆనద్ధచటులతూర్యవ్రజ మూశర తాళగరిమమును గంచుమించుగ నొత్తెను. పరిణయాగత దిగంతనృపతి నాగాశ్వరథపదాతి కోలాహల మూ

చటులతూర్యవ్రజము నంటఁ జరచెను. ఇట్లు నాదాత్మకబ్రహ్మ మఖండమై రోదసినెల్ల నతిశయిల్లెను.

ముజ్జగమేలు వేలుపుందొర తలవాకిట నిలిచి వివాహ యత్నములు సేయుచుండ సురాంగనాజన మజ్జననాధునకు మజ్జనాదు లొనరింపసమకట్టెను. "ఓ తార! ఈరాజుదరిఁ జేరి సేవలుసేయఁ దటితారసిల్లెనే. ఓ మేచక! ఈధరేంద్రస్వామి రాజమాత్రుఁడా? అంటుమై నీతని మైనంటవే. ఓ శశిరేఖ! ఈ సర్వమంగళావాసుని శిరసంట నీవేజాణవుగదే. ఓతిలోత్తమ! కమనీయగతి నూనియ నంట నీవుగా కెవరు నేర్తురే? ఓ రత్నమంజరి! వసుసంవహానలీలఁ బరిఢవిల్ల నీవే నేర్పరివే" యనుచుఁ జటులచాటూక్తు లాడుకొనుచు వేల్పుపూఁబోఁడు లాభూపాలు ఫాలమున శుభాక్షత లునిచి మంగళస్నానము చేయించిరి. ఒక శరద్రమ్యరాజోజ్వలాస్య యా గిరిజాసక్తు నౌదల తడియార్చెను. ఒక మానసాభిరామ యారాజహంసుపై మృదుజలార్ద్రానిలం బడరించెను. ఒక లతానిభాత్యంతకోమలాంగి యా మోహనాగ్రణి కలరు లందించెను. ఒక సురభిచరిత యా జగజ్జీవను వరంగధపరిలేపనమున నలరించెను. ఒక నిర్మలస్వాతివిఖ్యాతినిధి యాఘనకంకణశుభాంకగరిమఁ దాల్చు నగణ్యలావణ్య రత్నాకరునకు బహువిధామూల్య మణికలాపము లునిచెను.

ఆపై నాపృథ్వీపతి ఘనసారచూర్ణ తిలకము సవరించి నిధీశదత్తమగు నూతనమకుటము ధరించెను. ఆకిరీటవీధిపై దివ్యాంగనలు కల్పలతాఘటితమగు మత్తెపుంభాసికము నను

సంధించిరి. కర్ణములం బలారిద త్తములగు కట్టాణిసుపాణిరెయొంటు లంటించిరి. అబ్ధినాథుఁడొసంగిన సుధాగుళికానిర్మలహార మొండు పేరురంబునం గీలుకొల్పిరి. గరుడసమర్పితములగు నభినవగారుడమయాంగదముల బుజపీఠిఁ బాదుకొల్పిరి. అలకా రాజకుమారుఁడంపిన చొక్కపు గెంపుల పెండేరముఁ జరణమున హత్తించిరి. సురభూజార్పితమగు చెందిర కావిపట్టుం గట్టబెట్టిరి. ఇట్లు కళ్యాణంబునకుం గట్టాయితంబై నర దేవపరివారపరి వృతుండై యా రాజేంద్రుం డింద్రపురస్సరముగా నగేంద్రనగ రాభిముఖుండై బయలుదేరెను.

ఇఁక నిట హరిరచిత గిరిపురప్రాంగణవీధుల సర్వోళి దివిజ మురజవిరావము వితతమై గిరిజా వైవాహికకలకలమునకువడివడి దరువిడెను. ఆతూర్యములు విని ముహూర్తము డాయవచ్చె నని యుత్సాహులలై యాప్తసఖు లాయగకన్యకు మజ్జనలేపనా లంకరణాదు లొనరింప దత్తరపడ సారిగి. వివాహమందిర మందలి కురువిందవేది నిడిన వజ్రపీఠిపై గిరికనుంచి నెన్నుదుటఁ దాలమాక్షతలు ఘటించి పుణ్యభామినులు సకుంకుమ పటీర రజముతో నలుఁగులువెట్టిరి. పిమ్మటఁ జంద్రకాంతమణిమజ్జన శాలలో విశాల హేమపీఠి నుంచి పటీరజలములఁ దలయంటి శాతకుంభకలశీశుద్ధాంబువులతో స్నానమాడించిరి. నిండువెన్నెల పొరవంటి దువ్వలువతో మైతడి యొత్తిరి.

ఉత్తమ పుణ్యనదీకాంతలు తమతమ తమ్ములఁ దిగిచి తన్ముఖలక్ష్మికిఁ బ్రదిష్ఠారీతిబహుచిత్రదళంపుటారతులెత్తుచుండ నచలకన్య యమూల్యపద్మమాల్యముతో నెసంగు చేదిరాజేంద్ర భుజాంతరకల్పమగు వివాహవేదికకు వచ్చెను.

ఆర్యాకల్ప యగు నక్కుమారి శాకల్పవిభూతి కలుగునట్లుగా నింద్రాణియాకల్పలలామకంబులఁ గల్పకదామకములు నిచ్చెను. పైదలియొూర్తు జడవాహములమించు నాజవరాలి నెఱివేణిఁ దఱియార్చి ముడిచెను. కోమలియొూర్తు తుమ్మెదల దాటుఁ దాటు నాతరుణి క్రొవ్విద సంపఁగిదండఁ జెరివెను. చామయొూర్తు చిమ్మచీకటిఁ గికురించు నా చెలువ వేనలిఁ జంద్రసూర్యులనుంచెను. సుదతియొూర్తు నభంబుఁ దెగడు నమ్మగువ కొప్పున నిర్దోషంపు చుక్కచేఱు ఘటించెను. చకిత సారంగశాబలోచనయొూర్తు మహా మహానీరరాశిం బకపక హసించు నన్నెలఁత తుఱుము మరకతశకల కలితమృదుల దూర్వాంకురములలోఁ గదియ జేసెను.

అధరమాధుర్య భిక్షాగతమగు సుధాఘుటిక యొూయన ముంగరఁ గుదురుపరచిరి. సమయానుగుణముగ మహోచ్చగతింగన్న గ్రహపాళియొూయనఁ జనుదోయిపై నవరత్నసరములు వైచిరి. కిసలకోరక భృంగకీరవర్గమొూయన దోర్వల్లి బలువన్నె తొడవులు నిచిరి. అష్టాంగయొూగకలన ననఘజఘనాను షంగము గాంచిన వజ్రకాంచికల నిడిరి. అంగజితరతి బిరుదాంకమొూయన మణిమయమకర నూపురము లంఘ్రులం దొడిగిరి. ఈరీతిఁ బౌలోమీప్రభృతులు కుమారిని సర్వమంగళాలంకృతం గావించిరి.

ఇంద్రసహితులగు దిక్పాలురును వసుభూపాలు నలంకరించి శుభలగ్నముఁ బ్రతీక్షించుచుండిరి. ఇంతలో నృపోపాయనార్హములగు ఘనుల నన్వేషింపనోయన రాగమహి

తుఁడై నభోమణి రత్నాకరప్రాంతముం జేరెను. వసుగిరికా కరగ్రహణ మహోత్సవాలోకనానందమున సమరేంద్రరమణులు గుమి గూడు నభఃప్రాసాదసీమ ఘుసృణాలేపమొనర్చి, ధూప మిడి, ముగ్గులు పెట్టిరో యన సంజయు, నిరులుఁ దారకలు నెసంగెను. వైజయంత సౌధోపరితలంబునఁ జేరి చేదిరాణ్ణగరీ విలాసములం దిలకింప నిక్కి చూచు స్వర్ణగరి ముఖము పైపైఁ దోచుచున్నదో యనఁ గ్రమముగా రేరాజు మేను తొలుగట్టు తుదం బొదలెను. సురమిత్రుని శోభనవేళ సుధాంశుఁడు ధరణిపై జందనసేకము నించెనో యనఁ గౌముదీరుచు అజాండ గోళము నిండారెను.

లగ్నం బతినికటంబయ్యెనని యప్పు డాంగిరసుండు హెచ్చరింపఁగా దైవతవిభుం డాదరమున నవ్వసురాజు నాయత్తము గమ్మని తొందరించెను. పుణ్యభామినీకృతములగు మాగధ గానములు చెలంగ రాజేంద్రుం డైరావతము నధిరోహించెను.

ఇవ్విధంబున నవ్వసుంధరా ధురంధరుండు పురందర సింధుర స్కంధాధిరూఢుండై పాండురద్వీప రాజోపరి క్రీడనోల్లాసి యగు సింధుజావిలాసియో యన ననన్య సామాన్య మహా విభవంబునం దరలి కతిపయ ప్రయాణంబులఁ గోలాహలపురంబు సేరనరుగునెడ శైలసమ్రాట్పురీ పురంధ్రీమణు లాగిరికా పరిణేతృ దర్శనకాంక్షచేఁ గ్రీడాసౌధతలముల నెక్కి వివాహదీక్షా రమణీయమూర్తియగు శౌరిపైఁ గలశాబ్ధినిర్మలోదారతరంగ రేఖలు సుధాలవములు వెదజల్లుకైవడి వసురాజుపై మంగళాచార లాజములం జల్లిరి.

అప్పుడన్న దీశ్వరుండును నా ప్తబాంధవులతోడను, గంగా ప్రముఖ పుణ్యతరంగణీ రమణులతోడను నెదుర్కొనఁగాఁదన్మం దిరద్వారసీమ భూపతి యైరావతము డిగ్గి సుగవేత్రధరులు సాహో యనుచుండఁ గోలాహలప్రధాని నిర్దిష్టమగు మార్గమున మందిరముఁ బ్రవేసించెను. భామాగీతి కార్ద్రి విభావభవ్య జలా ప్తిచే మణికుట్టిమములు పాద్యమిడెను. పవమానశీర్ణ కేసరము లచే మందార సుమస్తాయమానములు సేసలు చల్లెను. కరదీప్త దీధితులచేఁ జిత్రితారాత్రికా పుత్రిక లారతులు ద్రిప్పిరి. పరి పక్వ ఫలరసములచే బహువిధద్వార రంభాకోటి మధుపర్క మొసగెను. ఈరీతి నన్నగరాజభవనలక్ష్మి వివాహవేళా మహో పచారము లన్నియు ముందే ఘటింప రాజచంద్రుఁడు కళ్యాణ వేదికం దరియ నేగెను. మౌక్తికపాత్రికలో బుధగవీదధిమిశ్ర సురద్రుమమంజరీ మధుమధుపర్కముఁ గొనితెచ్చి విధివిహిత ముగా నగాధిపతి యాగుణోదధి కొసంగెను.

అంతటఁ బురంధ్రీపరివృతయై చరణాంకకృతార్థమైన కప్రఁపునుముగ్గుపై మకరపద్మము లేర్పడుచుండ గిరికాతరుణీ మణి యానృపమణి భాగ్యలక్ష్మికరణి నొయ్యన నరుదెంచెను. మహేంద్రగురు నానతి నైదువలు గెందెర యెత్తి ప్రభాతవాత సంబోధితలైన నవపద్మిను లాత్మపరాగ పాళికాచ్ఛాదనమావ హించి కవజక్కవల గదియించునట్లు నవవధూవరులం గదియం దెచ్చిరి. రాజకరానుషంగముచే రామకరాంబుజమును రామ కరానుషంగముచే రాజు కరాంబుజమును నతిప్రకాశమై రాజిల్ల రక్షగట్టురీతి నారాజు కరమునందును, రాజముఖి

కరమునందును దేవగురుండు సమంత్రకౌతుకాంకములు గావించెను. సుముహూర్తమిదె సంపన్నమయ్యెనని మునులనుమతింప శైలేంద్రుండు భూమీంద్రున కాత్మనందనను ధారవోసెను.

ఆచంద్రార్క నక్షత్రసంతతిపై మించు తదీయ నిత్యగుణములను నాకులు ప్రశంసించుచుండ, శాశ్వత కళ్యాణగుణావహుండగు వసురాజేంద్రుఁడు నతచూడాపరికర్మచంద్రతపనులు నక్షత్రదామమునఁ బ్రతిబింబించునట్లున్న యాకన్నె యఖుత మాంగల్యసూత్రము నిలిపెను. పుణ్యసతీ కరోన్నమితలలితాంజలిడ్డై గిరిక విభునాదల సేసలం జల్లుచో నృపమౌళిరత్నగతమగు నాపె భవ్యాకృతిం గాంచి సఖులెల్లరుఁ "జూచితిరే! బాలయాక్షణమే పతి శిరమెక్కినది. అవును లే. సరిదాత్మసంభవకు ధరాధరోపరిస్థితి సహజమేకదా" యని మేలమాడిరి. అనంతరమా జవరాలు పాణియుగళీ పరిరంభణచేఁ బాటలీభవములగు లాజలను భావి నిఖలక్రతుభుక్తినిమంత్రణాక్షత శ్రీజనకములుగా శిఖియందు సమర్పించెను. ఆశిఖియుఁ బ్రసన్నుఁడై ప్రదక్షిణార్చులతో జితచిత్తభూరతులగు నాదంపతుల కారతులిచ్చెను.

పిమ్మట నా సతియుఁ బతియు నభిజాతవేదులతోఁగూడ జాతవేదుఁ బ్రదక్షిణాపాదనములచే నలరించిరి. దేవతావరుల వరములతోఁగూడ ధ్రువపదము నుత్తరోత్తరముగాఁ గాంచిరి. గురుతపోధనుల దీవనలతోఁగూడ నమ్మృతవర్ణముల నార్ద్రాక్షతములఁ దాల్చిరి. అవలోకి చలకిరీటములతోఁగూడ రత్నరమ్యములు నీరాజనములు దిలకించిరి. అనుపాధిక హవప్రదత్తములగు రుచిమదమృత సారాన్నసామగ్రులతో నాత్మబంధుజాతములను సకలశతమఖపురాధివాసులను దనిపిరి.

కరపాదములువచ్చిన గండశైలములో యననొప్పు నాగాయుతములును, మరున్నిరసనోద్ధతి గల్గు హరిణజాతమోయనం దనరు సైంధవోత్కరములును, బాయనిమించు లోదవు నంభోదములో యనమించు మణిమయస్యందనములను, యానవిలాసమెసఁగిన నవలతావళియోయనఁ బొల్చు సరస కన్యాసహస్రములను, సుచితరూపములు వహించిన తన మణి హేమరజతములోయనఁ దనరు వివిధశయన పాత్రాసనములను హరికృపాలబ్ధశుభశాలియగు నయ్యచలమహాళి భూజానికిం గానికలొసంగెను. శుక్తిమతియు నిరంకుశద్విస్పృమర వ్యాప్తిగలవాని, శుచివృత్త మహాత్వముగలవాని నాత్మజమణుల జామాతకు సమర్పించెను.

నగారి సురభిసంతానవిస్ఫూర్తి నిచ్చెను. వహ్నియిష్టార్థసంసిద్ధి నిడెను. సమవర్తి యహాత ధర్మగుణము లర్పించెను. క్రవ్యభోజి కామ్యరూపతం గూర్చెను. సలిలేశుఁడు భువనవశీకారము ఘటించెను. వాయుదేవుఁడసమ దివ్యామోదమొసఁగెను. నిధిరాజు కళ్యాణసామగ్రి ఘటించెను. శివుండు జితదర్పకత్వముఁ బ్రసాదించెను. అఖిలమునులును బ్రబల దీర్ఘాయురారోగ్య భాగ్యకరములగు వరములు సమకూర్చిరి. ఇట్లు సకల సురమునిగణంబుల యగణిత మంగళాచరణంబులతో గిరికపెండ్లి యఖండ వైభవ సామగ్రితో శుభనిర్వహణమునం బరిఢవిల్లెను.

బాలప్రభా ముద్రాక్షరశాల, బాబీనగర్, గుణదల.

